శతకంఠ

# రామాయణము

అయిదు అంకములుల నాటకము.

గ్రంథకర్త

ద్రోణంరాజు సీతారామారావుగారు.



ప్రకాశకులు

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు

నేషనల్ బుక్కు డిపో

రాజమండ్రి

రాజమహేంద్రవరి

దేశీయ విద్యాలయ ముద్రణాలయంబున ముద్రింపఁబడినది

1926

 [వెల 0-10-0

# రసపుత్ర విజయము

గ్రంథకర్త—దోసింతరాజు సీతారామారావుగారు.

ఇది విమలాదేవి నవలననుసరించి మిగుల రసవంతముగా వ్రాయబడిన చరిత్రాత్మకమైన నాటకరాజము— రాజమహేంద్రవర చింతామణీనాటకసమాజము యాక్టరు కీర్తిశేషులైన అల్లక చంద్రశేఖరముగారిచే రచియింపఁబడిన కీర్తనలతో విరాజిల్లుచున్నది— వెల1-0-0

# తానీషా.

(గోలుకొండరాజ్య వినాశనము)

గ్రంథకర్త—దూలగుంట వెంకటరమణయ్యగారు

పండితవర్యుల సదభిప్రాయములతో విరాజిల్లుచున్నది— 172పేజిలు— గ్లేజుకాగితము— వెల 1—0—0

# సంగీతచంద్రకాంత

గ్రంథకర్త— కొడాలి సత్యనారాయణరావుగారు,

ఇదిఅనేక నాటకసమాజములచే ప్రదర్శించిన కథగావున యిందు బొందుపర్చలేదు— వెల 0—12—0

# శారదావిజయం.

గ్రంథకర్త— కొడాలి సత్యనారాయణరావుగారు

ఇందు శారదామాధవులు పెక్కుకష్టములకులోనై చివరకు సౌఖ్యదశ ననుభవింతురు— ఇతివృత్తము చక్కగా పోషింపఁబడినది,

వెల 0—12—0

దొరకువారు

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

నేషనల్ బుక్కు డిపో,

రాజమండ్రి.

శ్రీరస్తు

శతకంఠ

# రామాయణము

(సీతా విజయము.)

(అయిదంకముల నాటకము.)

[illegible]

ద్రోణంరాజు సీతారామారావుగారు.



[illegible]

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

[illegible]

[illegible] రాజమండ్రి.

[illegible] 10 [illegible]

శ్రీసువిద్యాలయ ముద్రణాలయమున ముద్రింపబడియె.

రాజమహేంద్రవరము.

1920



వెల 0 12 0

# పీఠిక

అర్యులారా?

సీతావిజయము శతకంఠరామాయణమును పేరిట పూర్వము మర్దనకవిచే ప్రబంధరూపకముగా రచింపఁబడినది. చిన్నకథయగుటచేతను, యిదివరకు నెవ్వరిచేతను నాటకరూపముగా వ్రాయఁబడి యుండకపోవుటచేత ప్రదర్శనమునకును చదువుకొనుటకు వీలుగానుండవలయునని తలంచి చిన్ననాటకముగా వ్రాసితిని, కథయందుండు యాదరభావముచేతనైనను లోకులుదీని నాదరభావముతో జూతురుగాక యని నమ్ముచున్నాను. ఈగ్రంథముయొక్క కాపీరైటు మొదలగు సర్వస్వాతంత్ర్యములు రాజమండ్రి బుక్కుసెల్లర్సు టి. వి. రమణయ్యా అండు బ్రదర్సువారికి యొసంగినాను

రాజమండ్రి.
21—10—24

ఇట్లు సుకవివిధేయుడు
దా॥ సీతారామారావు

# ఈనాటకమునవచ్చు పాత్రలు.

## పురుషులు.

శ్రీరాముడు—సాకేతపురాధీశ్వరుడు

లక్ష్మణుడు—రాముని తమ్ముడు

హనుమంతుడు—రామదూత

సుగ్రీవుడు—శ్రీరాముని హితుడు, వానరపతి

విభీషణుడు—రావణుని తమ్ముడు

శతకంఠుడు—పరితాపలంకాధిపతి

వజ్రకంఠుడు<br>మొదలగువారు } శతకంఠుని మంత్రులు

జాబాలి<br>శాండిల్యుడు } మునులు

(ఇంకను సందర్భానుసారముగా సేవకులు మొదలగువారు వత్తురు)

## స్త్రీలు

సీత—శ్రీరాముని భార్య

చిత్రగంధి—శతకంఠుని తల్లి

శ్రీరస్తు.

# శతకంఠ

# రామాయణము

## ప్రథమాంకము

ప్రదేశము-సాకేతపురంబున శ్రీరామునిమందిరము.

(శ్రీరాముఁడు, కణ్వుఁడు, శాండిల్యుఁడు, జాబాలి మొదలగు మునులు ప్రవేశము)

శ్రీరా—మునీంద్రులారా! భవదీయ దివ్యపాదపంకజరజంబు సోఁకుటం జేసినామందిరంబు పావనంబైనది. మహానుభావులును, విపులజప తపోగరిష్ఠులునునగు మీరేదియేని కార్యమునుబూని యిప్పుడ నన్ను ధన్యునింజేయ నరుదెంచియుండిరని నేను తలంచెదను. కావున నాయందుఁ గృపాంతరంగులై యట్టిదేదియో సెలవిండు

కణ్వ—

చ. రవికులవార్ధియందున సురాఢ్యులు ప్రార్థనసేయఁ గాంచి యీ
భువిభరమెల్ల దీర్చుటకుఁబుట్టుకనొంది దశాస్యదానవున్
బవరమునందుఁగూల్చి, మునివర్గముబ్రోచి, సురాళిమెచ్చగా
నవిరళఖ్యాతిఁగంటివి మహాత్మ! నినున్ వినుతింపశక్యమే!

శాండి—సూర్యకులపూర్ణసోమా! శ్రీరామా! నీవుజనియించి యనేక దానవుల నొక్కుమ్మడి నుక్కడగించుటచేతనే మాతపంబుల

కేమియు నంతరాయంబు గలుగకుండ సాగుచున్నవి. రావణుం
డు మడిసినప్పటినుండియు మేముహాయిగ సుఖించుచున్నారము

జాబా—శ్రీమన్నారాయణస్వరూపుండవగు నీవు మాకాకడు గార
ణంబు మాచేవినఁగోరి యడుగుచుంటివిగాని నీకుఁ దెలియకుం
డునా? అయినను నడిగితివికావునఁ జెప్పకఁదప్పదు. రావణుని
బాధ లడఁగిపోయినవికదా యని యానందించుచుంటిమి. కాని
నేటికి మరల,

తే. గీ. రావణునికంటె మిగుల దు♦ర్మార్గుఁడైన
శతముఖు డను నొక్క ని♦శాచరుండు
కాలరుద్రునిలీలను♦గర్వమూని
మమ్ము హింసింపఁదొడఁగెను♦మాన వేంద్ర.

దేవా! ఈరక్కసునిఁ జూచినప్పుడింతకంటె దశకంఠుడే మంచివాడని
తోచినది. ఆతనికంటె బలమునందును, ధనమునందును బదిరె
ట్లధికముగలవాడై మూడు జగంబులయందును దనకేరును
బ్రతిలేరని గర్వించి చరించుచున్నాఁడు.

తే॥ గీ॥ కఠినదైత్యుఁడుబెట్టు యి♦క్కట్లకేము
సైపగాలేకనీపాద♦శరణమంద
దలచియే తెంచినారము♦లలితగతిని
నీదెభారము మముఁబ్రోవ♦నీరజాక్ష॥

కణ్వ—

సీ॥ జగములకపకారి♦యగునాదశాస్యునిఁ
బుత్రమిత్రులతోడ♦బుడమిఁగూల్చి
ఘనవీరులకుంభ♦కర్ణాదిదైత్యుల
ఘోరశరంబులఁ♦గూల్చివైచి

శరణన్నయావిభీ ♦ షణునిలంకారాజ్య
నాధునిగాజేసి ♦ సత్యకృపను
సకలమునులకును ♦ సౌఖ్యంబుగలిగించి
యమరాళికెల్లను ♦ హర్షమొసంగి
తే॥ గీ॥ దశదిశలయందునీ ఘన ♦ యశమునించి
నావు; లోకంబురక్షించి ♦ నావు; నీదు
దయనుమను మంటివిన్నాళ్లు ♦ ధారుణీశ
మఱలయొనఁగూడె కష్టముల్ ♦ క్ష్మాతలమున

జాబా — రామచంద్రా ? ప్రతాపలంకాపు రాధీశ్వరుండగు శతకంఠుం
డను దానవేంద్రుండు భారతీపతీ వరసంజనితదుర్వార బలోపే
తుండై చరింపుచు మమ్ములనేక బాధలంబెట్టుచున్నాఁడు. అతఁ
డొనర్చు హింసలిట్టిట్టివని చెప్పఁజాలము. అతఁడు రావణాదిదా
నవులను నీవురణంబునఁ గూల్చితివనివిని దండతాడిత మహో
రగంబు కరణిమండిపడుచు నాపగఁ దీర్చుకొందునని బ్రహ్మం
గూర్చితపంబుఁజేసి, జగతింగల్గు నెట్టిపురుషులచేతను జావురే
కుండను,రణరంగంబునఁ దనశరీరమునుండి రక్తబిందువునేలఁ బడె
నేని తన్నుఁబోలిన దైత్యులు నూర్వురుదయించునట్లును, రణం
బున భయము, శ్రమయు, గలుగకుండునట్లును వరంబులు గ్ర
హించినాడు.

సీ. మునియాశ్రమములకు ♦ ముందుగానే తెంచి
బలుహోమకుండముల్ ♦ పాడుజేసె
యజ్ఞపశువులను ♦ నవనిపై వధియించి
కఠినతాళ్ళను మమ్ముఁ ♦ గట్టివేసె
జలజాకరమునందు ♦ జలమొల్లనింకించి
కల్లుసారాయినిఁ ♦ గలిపెనందు

ఫలపుష్పతరులతోఁ ♦ బరిఢవిల్లుచునుండు
వనములనెల్లను ♦ బాడుఁజేసె

తే. గీ. యాశ్రమోపాంత భూజంబు ♦ లవనిదాల్చె
యాగములు జేయుగుండంబు ♦ లన్ని పూడ్చె
బ్రహ్మయిడిన వరమున గ ♦ ర్వంబుఁబూని
భయము గలింపుచుండెను ♦ పార్థివేంద్ర.

శాండి—ఆదానవుం డొనరించు దుష్టకృత్యములు చెప్పుటకు మాకు నోరాడకున్నది. కడువడిగాఁ బరుగెత్తుకొనినీముఖంబున నీవిభూతిపూత యేమిటని దానినాకును, జంద్యంబు తెంచును, జడల నూడదీయును, మొగంబున నుమియును, తపముచేయుచున్న మామెడలకుఁ బట్టలనుజుట్టి పడద్రోసి హింసించును.

తే. గీ. కన్నుగానక యీరీతి ♦ గర్వమూని
సాధు హింసలఁబెట్టగా ♦ సాగినట్టి
కుటిలదానవు నాజిలోఁ ♦ గూల్చివైచి
యాపదల బాపవే కృప ♦ నమలచరిత.

దేవా! నీవుదక్క మాకెవ్వరును దిక్కులేరు. నీశరణ మందవచ్చితిమి. అభయమిచ్చి మమ్ము రక్షింపుము.

శ్రీరా—అన్నా! కష్టాత్ముడైన యామ్మృకడిరక్కసుండు మిమ్మెట్టి యిక్కట్లకుఁ బాలుసేయుచున్నాఁడు. శ్రీరాముం డెట్టిదియైనను సైరించునుగాని సాధుహింసకుమాత్రము సైపఁజాలడు. తాపసోత్తములారా! ఇంక మీారు ఖేదంబులయందుఁ గుందకుఁడు.

మ. దశదిగ్భాగములన్ బ్రతాపమహిమల్ దట్టంబుగానిండన
ద్దశకంఠున్ వధియించినావికను మో ♦ దంశారపహోరాజియం
దుళితాస్యుల్ సురులెల్లమెచ్చగను మ ♦ ద్దోస్సారమేపారఁగఁ
ర్కశభల్లంబుల వంహరింతుచెదను లోక ♦ త్రాణపారీణతన్

ఇంకమీరు సంతోషంబుతో మీమీ నెలవులకుఁ జనుఁడు
కణ్వ—రామా! రఘునందనా! మమ్మురక్షించు భారమునీయది ఇఁక
మేము పోయివచ్చెదను (నిష్క్రిమింతురు)
శ్రీరా—సేవకా! నీవటిగిలక్ష్మణుని నిటకుఁదోడ్కొనిరమ్ము
సేవ—చిత్తము (నిష్క్రమించును)
శ్రీరా—(తనలో) అక్కటా! ముందువెనుకలరయక శాశ్వత్తముల
కభయంబిచ్చితినిగదా ఆశతాసుర్యండెంత పరాక్రిమవంతుండో
అభేద్యమైన వరములు బ్రిహ్మచేత గన్నవాడట. పురుషులచేఁ
జావు లేదట ఆహా! యెట్టికార్యమును ముందువెనుకలు చూడ
కుండఁజేయుటకు సాహసింపరాదు అయినను నింతలో తొందర
పడనేల? తమ్ముడగు లక్ష్మణునితోఁగూడ యోచించెదనుగాక
(ఎదుటచూచి) అదుగో! లక్ష్మణుండు వచ్చుచున్నాఁడు
(లక్ష్మణుఁడు ప్రివేశించుచున్నాఁడు)
లక్ష్మ—(తనలో) అన్నగారు ననిప్పుడేలరమ్మని యాజ్ఞాపించిరోకదా
(సమీపించి) ఈయన దీర్ఘాలోచన తత్పరుడై యున్నట్లు కాన
నయ్యెడి, (ప్రికాశముగా) అగ్రిజా! నమస్కారములు.
శ్రీరా—తమ్ముడా! ఇటుఁ గూర్చుండుము.
లక్ష్మ—అన్నయ్యా! నీవేదియో దీర్ఘాలోచనము సల్పుచున్నట్లు తో
చుచున్నది
శ్రీరా—తమ్ముఁడా! అకారణముగ నేటిదినంబున లేనిపోనిది నెత్తిపైఁ
బెట్టుకొంటిని. ప్రితాపలంకాపురాధీశ్వరుఁడగు శతకంఠుండను
దానవుండు తమ్ముబాధింపుచుండెనని మునీంద్రాదులు నాయొద్ద
కువచ్చి శరణుగోరఁగా నేనాదానవునివధించి లోకంబుల రక్షిం
చెదనని యభయమిచ్చినాను

లక్ష్మ—ఇంతమాత్రమునకేనా నీవుడెందంబున విచారింపుచుంటివి.

శ్రీరా—తమ్ముఁడా! ఇట్టిది స్వల్పకార్యముగా భావింపరాదు రావణుని దునుమాడుటకు లంకకరుగుచో నొక సముద్రము దాటుటకే భూతలంబునఁగల సమస్తనగంబులను దెచ్చి సముద్రమునఁ బడవైచితిమి. ఇప్పుడు పుష్కరలంకకరుగుటకు సప్తసముద్రములను దాటవలసియున్నది. ఒకవేళ యెట్లో దాటుదుముగాక! అనేకవీర రాక్షస భటపరివేష్టితంబైన కోటలనుదాటి ధూర్తశతకంఠుని దునుమాడు టెట్లు?

తే॥ గీ॥ ఏలవచ్చిరిమునులు; నా ♦ కేలదీని
జెప్పినారు; చెప్పినయంతఁ ♦ జిత్తమందు
వెనుకముందులుజూడక ♦ వెట్టినగుచు
నభయమొసగితి నేలనే ♦ ననుజయిపుడు

తొందరపడుట యెవ్వరికినిదగదు మునులతోఁ బ్రతిజ్ఞఁ బలికితిని బ్రహ్మచే వరంబులందిన దుర్వారబలవిక్రమ సంపన్నుడైన యాదానవేంద్రుని జంపుటకుఁదగిన బలసామగ్రి మనయొద్ద నెచ్చటనున్నది?

లక్ష్మ—

తే॥ గీ॥ తగునెనీవంటివానికి ♦ దైన్యమంద
నాదినారాయణుండవీ ♦ వమలచరిత
రామనామంబువిన్నంత ♦ రక్కసుండు
భయమునందక యుండునే ♦ పార్థివేంద్ర

తే॥ గీ॥ రక్కసుండెంతవాడైన ♦ రామచంద్ర
నిలువశక్యమే నీముందుఁ ♦ గలనియందు
దూదికొండెంతపొడవున్న దుర్భరాగ్ని
బడినయంత నెభస్మమై ♦ పరలుగాదె

నీపరాక్రమశక్తులు నీ వెఱుంగకున్నావు.

తే. గీ. వాడిబలమెంత వాడిగ ♦ ర్వంబదెంత
అతనిసాహసమెంత వా ♦ డనఁగనెంత
బ్రహ్మశరమును మంత్రించి ♦ వైచినంత
దృటినిఁ గూలఁడే నీచేత ♦ ధరచరిత

రణభారంబు మీరువహింప నావంతయు నవసరములేదు. నే నొక్కండనే రక్కసునిగూల్చి మీకు పాదంబు గంగజేసెద ను. అది యట్లుంచుఁడు.

మ. స్థిరమైనట్టితపంబుఁజేసి హరున ♦ శ్శీఘ్రత్రిశూలంబొగిన్
సురలెల్లన్ నుతియింపఁ గైకొని రిపు ♦ క్షోభంబుఁగావింపుచున్
సురవైరిన్ లవణాసురున్ రణములో ♦ సాక్షించె; శత్రుఘ్నుఁడో
నరపాలైక శిరోమణీ మనములో ♦ నన్ శంకనీకేటికిన్.

భరతుండట్లుండా, మఱియు,

చ. రసికులు విద్యలందుఁ బర ♦ రాజభయంకరు లాజియందు; గ
ర్వశరముల్ ధరించి సమ ♦ రంబుననిల్చి శతాస్యుగూల్చి స
ద్యసముగడింత్రిసీకు భవ ♦ దాత్మజులొచును బెంపుమీఱు నా
కుశలవులుండలేదె రణ ♦ కోవిదులన్ వచియింపశక్యమే.

వారికుమారులయిన జయవిజయులంగూర్చి చెప్పనక్కరలేదు. ఇదియంతయు నట్లుండ, మున్ను రావణునితో యుద్ధముచేయు టకు మనకపరిమితసహాయం బొనర్చిన సుగ్రీవాంగద జాంబవ దనల, సుషేణాది మహాకపివీరులందరును మనకై ప్రాణంబుల నయిన నిచ్చుటకు సంసిద్ధులైయుందురు. వీరందరకంటె మనకు ముఖ్యుఁడింకొకడు గలడు.

సీ. పుట్టినప్పుడె చాల ♦ బెట్టిదంబున బోయి
పట్టి మ్రింగెను భాను ♦ ఫలమటంచు
శంక యింతయు లేక ♦ లంకాపురము జొచ్చి
యక్షుని దృటిలోన ♦ హతము జేసి
కోపాన లాటోప ♦ దీపితశాఖలచే
గాల్చెను మున్ను లం ♦ కాపురంబు
ఆజియందున మూర్ఛ ♦ నందిన నన్ను స
జీవుగా జేసె సం ♦ జీవి దెచ్చి

తే. గీ. అట్టి జగజెట్టి యాగాడ్పు ♦ పట్టి; మనకు
ప్రాణసమమైన హితుఁడౌచు ♦ వరలుచుండ
దానవుని గూల్చు టది యెంత ♦ ధారుణీశ!
శంకమానుము నీవింక ♦ స్వాంతమందు.

శ్రీరా—తమ్ముడా! నీమాటలకు నే నెంతయును సంతసించితిని. ఇయ్యది నీవు స్వల్పకార్యముక్రింద జూచితివి. మున్ను పదితలలరక్కసునిగూల్చుటకు మన మెంతశ్రమనందితిమో నీవు యెరింగి యుంటివిగదా! కానిమ్ము, యిప్పుడు మనము విభీషణుని హనుమంతుని రావించి వారియాలోచన ననుసరించెదముగాక!

(విభీషణ హనుమంతులను స్మరించును)

లక్ష్మ—అగ్రజా! స్మరణమాత్రముచేతనే వారు వచ్చుచున్నారు

(విభీషణ హనుమంతులు ప్రవేశము)

విభీ—(రాముని సమీపించి) మహాత్మా! రామచంద్రా! నీపాదపంకేరుహంబులకు సేవకుండు నమస్కరించుచున్నాఁడు.

హను—దేవా! దేవరవారి పాదసేవకుఁ డిదే సాష్టాంగదండప్రణామంబు లర్పించుచున్నాఁడు.

శ్రీరా—హనుమద్విభీషణులారా! మీకు శుభంబగు గాక. ఈయాసనం
బుల నధిష్ఠింపుఁడు. (ఇరువురును నాశీనులగుదురు)

విభీ—(శ్రీరామునిఁజూచి) తండ్రీ! నీపాదసందర్శనమువలన నాకెంత
యో ముదంబుగలిగినది. నన్ను నీయంతరంగంబునకుఁ దలంచు
ట కేమికారణమో, నేనెట్టికార్యంబు నీకుఁ జేయవలసియున్న
దో యానతీయుము

శ్రీరా—విభీషణా! ప్రతాపలంకాపురాధీశుండగు శతకంఠుని బాధలకు
దాళజాలక నాకడకరుదెంచిన మునులకు నేనాదైత్యునిం గూ
ల్చెదనని ప్రతిజ్ఞఁ బలికితిని. ఇవ్విషయంబున నాకేమియుఁ
దోఁచక నిన్ను రావించితిని.

మ. అలనాఁడా రణరంగమందున దశా ♦ స్యాభీల బాణాగ్నిలో
బడి సంతాపముఁబొందుచుండఁగ నిదే ♦ వారాతిమర్మంబులన్
లవినాకున్ వినిపించి యాతనిని దు ♦ న్మాడంగ గావించి ని
స్తులకీర్తిన్ నిలబెట్టినావు ఘనసం ♦ తోషంబుతో ధీనిధీ.

ఆసమరసముద్రంబున నిన్నొక నావగా జేసికొని తరించితిని.
నీవంటి ప్రియభక్తు డెచ్చటను లేడు. ఆరావణుని దునుమాడు
టకే నానాకష్టంబులను బొందితిని, ఇప్పు డాశతాస్యుని వధిం
చుట యెట్లోకదా?

తే॥ గీ॥ దానవుఁడు సేయు కార్యముల్ ♦ తలపరాదు
గోవులను బ్రాహ్మణులను గ ♦ గ్గోలుబెట్టు
చుండునఁట; మునివర్యుల ♦ దండనంబు
సేయునఁట వానినాజ్ఞ శి ♦ క్షించుటెట్లొ?

ఇంచులనుఁగూర్చి నీవేమియభిప్రాయంబు నొసంగుదువోయని నిన్ను
రావించితిని.

విభీ—దేవా! వాఁడెంత పరాక్రమవంతుఁడైన నేమి?

తే॥ గీ॥ వరములెన్నన్నొగనివట్టి ♦ వాఁడెయగును
గాక; మహాదాగ్నియెదుట శు ♦ష్కగహనంబు
నిలువలేనట్టిభంగిని ♦ నిన్నెదిర్చి
నిలువగానోపునేవాడు ♦ నేలఱేఁడ!

నిశ్చయముగా భూతలంబున వానికీడగు పరాక్రమవంతుఁడు లేడు. ఆతఁడు విధారవరసంజని తదుర్వార బలపరాక్రమ విక్రమంబులచే గర్వించియున్నాఁడు ఆదైత్యునిఁగూర్చి ముందుగానొక్కింత మీకెఱింగించెదను వాడిరాజ్యంబు ప్రతాపలంకయని మీ రెఱింగియుండిరికదా వానికి బదిమంది మంత్రులుగలరు వారందఱును శౌర్యపరాక్రమ భుజబలంబులయందు దనుజేంద్రునితో సమానులు. నేనుమీతోఁగలసి రావణాదుల దునిమించినానని విని నాపై నెప్పుడును వాఁడు మండిపడుచుండును. ఆతనినివధించుటకు నీవేశక్తుండవు

తే॥ గీ॥ నిక్కముగ వాఁడు నీచేత ♦ నీల్గుగాన
వానరావధిఁదోడ్కొంచు ♦ త్వరితగతిని
నరుగుదేరసుగ్రీవున ♦ కాజ్ఞఁబంపి
సమరయత్నంబునీవింక ♦ జరుపుమయ్య!

శ్రీరా—దానవుని బలపరాక్రమంబులసంగతి యట్లుంచుము. రణరంగంబునఁ బ్రవేశించినప్పుడు జయాపజయంబులు దైవాధీనంబులు. కాని, సముద్రంబునుదాటి యాప్రతాపలంకం బ్రవేశించుట యెట్లోనాకు మార్గంబు గానిపింపకయున్నది.

హను—దేవా! శ్రీరామచంద్రా! నీవింకు కాసంగియం బందుచున్నాఁడవు ఇప్పుడే నాకాజ్ఞనిమ్ము. కాలమృత్యువునైనను గదిసెదను

సప్తసముద్రంబులును నోకప్పుక్కిటంబట్టెడ సమస్తబలంబులను నావాలముమీదుగా సముద్రంబులనుఁ అట్లు గాదందువేని,

చం॥ సెలవిడిపంపుమీయిపుడె ♦ చెచ్చెఱ నేఁజనియాశతాస్యునిం
గలనవధించివచ్చెద న ♦ ఖండపరాక్రమ విక్రమంబునన్
దలపఁగఁబోరికిన్మనకు ♦ దానవవర్గం బినాశమన్న; నా
బలముచలంబునీవెఱుఁగ ♦ వా! రఘునందన! చెప్పనేటికిన్

శ్రీరాము——వాయునందనా! నీశక్తిసామర్థ్యంబులు మాకు సంపూర్ణం బుగఁ దెలిసియున్నవి.

సీ॥ బాలార్కబింబ బు ♦ ఫలమంచుగ బళింప
 నతివేగమునఁబుంటి ♦ శరిగినావు
ఉదయాస్తగిరులపై ♦ బదకమలములుంచి
 శాస్త్రముల్ రవియొద్ద ♦ జదివినావు
క్రూరగాకాసులే ♦ దాఁటఁబోనీకుండ
 వట్టెలఁకకుజిచ్చుఁ ♦ జెట్టినావు
మూర్ఛయందునమున్గి ♦ యున్నట్టి త
 మ్ములకు ప్రాణములిచ్చి ♦ బ్రోచినావు

తే॥ గీ॥ అవనిపీరాదివీరుండ ♦ టంచుఁబేరు
 నందినావు; మాహితుఁడవై యలరినావు
నీవిమలశౌర్యగుణము వ ♦ ర్ణింపదరమె
 మహితగుణవంత హనుమంత ♦ మాంన్యవంత

రావణునితోఁ బోరాటంబు జరుగునప్పుడు నీవద్వితీయ పరాక్రమంబున వర్తించినావు. నీవు మాయుండనుండగా నెట్టికొఱంతయు గలుగదుగాని సేనాసమూహంబు సముద్రంబెట్లుదాటునాయని మాత్రము శంకింపుచుంటిని. ఇందులకేమి దారిచూడనగునో యతి మాత్ర మూహింపఁజాలకయున్నాను.

హను—

శా॥ శంకంబొందనేల నీవిటురఘు ♦ త్తమ్మాధీశ సైన్యంబు; లా
తంకంబేటుయులేక వాలముపయిన్ ♦ దైత్యావళుల్ భీతిలన్
బింకంబొప్పగబోవ జేసెదను దో ♦ ర్వీర్యంబుదీపింపగా
లంకారాజ్యము జేర్పువాడనధీశా ♦ హ్లాదంబుసంధిల్లగన్

దీనింగూర్చి మీరనుమానింపవలదు సేనలనన్నియు వాలముపై నెట్లు నడి
పించునాయని మీరు తలంపకుడు. ఇదేనారూపము జూడుడు
(విశ్వరూపము జూపుచున్నాడు)

లక్ష్మ—చూచుటకు మహాభయంకరముగనున్నది

విభీ—ప్రళయకాల రుద్రావతారంబును మించియున్నది.

శ్రీరా—(తనలో) ఆహా! ఏమి శుభయంకర స్వరూపము? (ప్రకాశ
ముగా హనుమంతునిజూచి)

సీ. నిజపాదఘట్టన ప్ర ♦ జనితామితభార
జర్ఘరీకృతబి ♦ లేశయహీశ
వాలవిక్షేపసంభవ ♦ మరున్నిర్ఘాత
తుంగభంగా భీ ♦ లతోయరాసి
పటుసింహనాద ♦ శ్రవణమాత్ర
పరవశీభూతదిగ్గజ ♦ మహాభూతజాల
కరకాండచండనిర్ఘా ♦ తపాతనిహత
సమరదుర్జయని ♦ శాచరసమాజ
తతశతారనిశాత ♦ దంతప్రహార
నఖవిలుంఠితశ ♦ త్రుసేనాసమూహా
రాక్షసవిలోక నభయంక ♦ రస్వరూప
భవ్యగుణసాంద్ర! హనుమంత ♦ వనచరేంద్ర

పవనజా! నీభయంకరస్వరూపంబు వీక్షించి యందరును భయం
బందుచున్నారు. నీమహాతేజంబు నుపసంహరింపుము.

హను—(అట్లుచేయుచున్నాఁడు)

లక్ష్మ—ఆంజనేయా! ఇంతలో నెంతభయంకరస్వరూపంబుదాల్చితివి?

శ్రీరా—విభీషణా! మనమీ వాయుసూనుని సహాయంబున సముద్రం
బులుదాటి ప్రతాపలంకం బ్రవేశించుట కానంతము నందియుం
బుండను. కావున నింకముందు జేయవలసినకార్యంబులెవ్వియో
నిర్ణయించినచో బాగుండును. చేయఁదలంచినదేదో యతిశీ
ఘ్రముగ జేయుటయే మంచిదికనా!

విభీ—దేవా! చేయవలసినదేమున్నది? సుగ్రీవాదివానరబలంబులను
సత్వరంబుగ నిచ్చటకు వచ్చునట్లు గావించుటయేకర్తవ్యము.

శ్రీరా—అవును (హనుమంతునిజూచి) హనుమా! నీవు నాకెంతయు
గూర్చు భక్తుడవు. మున్ను సీతాసతికుశలంబుజెప్పి రావణుం
దునిమించితివి. ఇప్పుడుగూడ నీభుజబల విక్రమంబులు సహా
యంబుగాగొని శతకంఠరుని రణరంగంబున గెలించి లోకంబు
ల నుద్ధరింపదలంచియున్నాడను. కావున నీవులక్ష్మణుని వెంట
బెట్టుకొని కిష్కింధకరిగి సుగ్రీవునితో నాయత్నమంతయు నె
రింగించి, బలసమేతంబుగా నాతని తోడ్కొనిరమ్ము. (లక్ష్మ
ణునిజూచి) సౌమిత్రీ! నీవు మారుతసూతితోఁ గిష్కింధకరిగి
సుగ్రీవుని దోడ్కొనిరమ్ము- ఇంక భరతశత్రుఘ్నులను నానా
దేశాధీశులను దోడ్కొనివచ్చుటకు బంపెదను. విభీషణునిజూ
చి)విభీషణా! నీవుగూడ నీసైన్యంబుల నిచ్చటకు త్వరలోఁ దో
డితెచ్చుటకు యత్నింపవలయును.

విభీ—రామచంద్రా! నీవిషయంబున నాకుఁ జెప్పవలయునా? ఎట్టి

కార్యంబు సేయుట కయినను నీసేవకుండ నిరంతరంబును సంసి
ద్ధుఁడై యుండుననితలంపుము—నేను నేఁడే లంక కరిగి నాబలంబుల
న్నియు దోడి తెచ్చెదను—

శ్రీరా—(లక్ష్మణునిజూచి) తమ్ముఁడా! సుగ్రీవుఁడా యాదికష్టములయం
దున్న వానరవీరులను రావించుట కించుక జాగగునేమో! కా
వున నీవుహనుమత్సమేతుండవై నేఁడే యరుగుట మంచిది.

లక్ష్మ—అగ్రజుని యాజ్ఞననుసరించెదఁగాక.

శ్రీరాము—ఇప్పటికినామనంబున గలిగియున్నశంక పోయినది ఈవాయు
నందనుండును, విభీషణసుగ్రీవులును మనపక్షంబున నిల్చియుం
డగా శతాస్యుని వధించుటెంత? విభీషణా! హనుమంతా!

చ. పరమతపోధనాగ్రణుల ♦ పాలిటివాఁడవటంచు నన్ను భా
సురత నుతింప దేవతలు ♦ సొంపుగ మద్భుజవిక్రమంబునన్
సురరిపుఁడా శతాస్యునని ♦ సొక్కఁగఁ జేసెద; దప్పకుండ! మీ
యిరువుర సాయమున్న నది ♦ యే పదివేలగునాకుఁ జూడఁగన్.

విభీ—దేవా! మేము శ్లాఘ్యంబునకుఁ బాత్రులముగాము—

లక్ష్మ—అన్నగారూ! ప్రొద్దెక్కినది. భోజనానంతరమునఁ బ్రయాణ
సన్నాహ మొనరించుకొనవలయును—రండు—

శ్రీరా—మంచిది.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ రస్తు

శతకంఠ

# రామాయణము

ద్వితీయాంకము

పరిదేశము—సాకేతపురములో రాజవీధి.

(కామపాలుడు, జయంతుడు చెరియొకపక్కనుండి ప్రవేశము)

జయం—కామపాలా! కామపాలా! మాటమాట-

కామ—(వినిపించుకొనక పోవుచుండును)

జయం—(తొందరగాబోయి ఆపి) కామపాలా! ఎంతపిలచినను పలుకవేమి? ఎక్కడికింత దొందరగా బోవుచుంటివి?

కామ—మహారాజుగారా! ఆ-ఆయన వూళ్ళో నేయున్నారు. వారితో నీకేమిపనియున్నది?

జయం—(తనలో) 'బాగానేవుంది. ఇతడు బధిరుడు- (గట్టిగా) నీకు దగనిచెవుడు- ఇంత పరుగెత్తుకొనిపోవుచున్నావెక్కడికి?

కామ—అబ్బే! ఏదీ! చాలాప్రయత్నం చేస్తూవున్నాను. మాఅమ్మాయికి సంబంధం యెక్కడా కుదరలేదు. అయినా డబ్బుతోపని. అందుకోసమే చూస్తూన్నాను

జయం—(గట్టిగా) నీతో నెవడూమాట్లాడలేదు. (గట్టిగా) ఏమిటి విశేషములు? ఎంతగొంతుకచించుకొనియడిగినా వినబడదేమి?

కామ—తెలిసించి. ఏమున్నాయివిశేషాలు? మననగరంనిండా యెక్క

డచూచినా కోఁతులు చెలరేగినవి. భూమి యూఁగినట్లయినది.

జయం—ప్రితావలంక మీఁదికి శతకంఠుని వధించుటకు వానరబలము వచ్చినవికాబోలు.

కామ—అదేసంగతి. ఇక సన్నాహకు శ్రీరాజా లవారు బలములనన్ని టను తనసౌధముముందుకు రమ్మని యాజ్ఞయిచ్చినారు. ఒక వేళ సీతాదేవి వాటిని జూడగోరినదికాబోలు.

జయం—ఆబలములను నేనును చూచెదఁగాక-

(నిష్క్రమింతురు)

---

ప్రదేశము—సౌధాగ్రితలము.

[ప్రవేశము—రాముఁడు, సీత.]

శ్రీరా—రమణీ! చూచితివా? హనుమంతునకు మనమనుజ్ఞ యిచ్చిన దే తడువుగా, లక్ష్మణుని వెంటఁబెట్టుకొని కిష్కింధకరిగి, సుగ్రీ వాదివానరవీరులను సైన్యసమేతంబుగా దోడ్కొనివచ్చినాడు.

సీత—ఆతనిభక్తి వర్ణనాతీతము. (ఇంచుక యూరకుండి) ప్రాణేశ్వరా! విభీషణుండుగూడ తనసైన్యంబులతో వచ్చియుండెనా?

శ్రీరా—ఆతఁడును వచ్చియుండెను. అదియుంగాక మదాజ్ఞ శిరంబున ధరించి యనేకనరపాలురు భరతశత్రుఘ్నులవెంట వచ్చిరి.

సీత—మనోహరా! ఈవానరబలంబులలోనున్నమహావీరుల నామంబు లవినఁ గుతూహలంబయ్యె.

శ్రీరా—అల్లదేచూడుము-

గీ. బహుళజీవ భావభరణ దుర్భరభగ్న
పద్మజాండభాండ పటుత రధ్వ
నంబుభంగి నంబరం బదియగనార్చు
నతడె భానుపుత్రు డవనిపుత్రి.

గీ. ప్రళయకాల పవనపరిభావితాగ్ని శి
ఖల దృణీకరించు ఘనతరాపలోక
నముల వైరిలోకమాలోకించు
నతఁడె వాలినందను డతివమిన్న.

అటుజూడుము. కల్పాంత ఘనఘనాఘనధ్వని చందంబున గర్జించుచు
న్నవాడే వాలిసుతుండగు యువరాజు అంగదుండు. అదిగో సుగ్రీవుని
యొద్దకువచ్చి కతాస్యుని నేనొక్కడనే వధించెదనని చెప్పువా
డు నీలుండు ప్రచండమైన గదాదండంబును గిరగిరం ద్రిప్పుచు,
సంగమునితో వీరాలాపంబులాడు భల్లూకేంద్రుడయిన, జాంబ
వంతుడు అటుజూడుము.

ఉ. జలనిధిదాటిలంకిణి ని ♦ జ పిసురారులడాగురించి, యు
జ్వలగతి, సూక్ష్మరూపమున ♦ నాదుజయ్యనసిన్నటగాంచినాదు సేమ
ముగ లవితెముద బుతో నపుడు ♦ నాతిరోనీకేతుంగంగ జేసి కా
వలిగల దైత్యులందును ము ♦ వాయుసుతుండతడే తలోదరీ

సీత—మనోహరా! మనపక్షంబున నింతబలంబుండగా నాశతకంఠుని
సంగరంబునగెల్చుట యెంత,

శ్రీరా—రమణీ! నీవువచించినమాట సత్యమే; కాని రావణునకును
వీనికిని బలపరాక్రమములందు హస్తిమశకాంతరమని వినియున్న
వాడను. అయినను, అరక్కసుండువిరించి వరసంజనిత బలగర్వం
బున, గర్వించియుండి మహాపాపకార్యంబులను జేయుచున్నాడు.
వానిపాపంబులే వానినడంచునుగాక!

క॥ ఏకరగ్రను నిప్పుండిన
నాకరగ్రయకాలు ♦ బాపమరయక నెవ్వం

డేకరణిజేయు వాతం

డాకరణినెయును ♦ భవించుటయ్యెఫలముల్

(ఇంచుక యూరకుండి) అన్నా! మఱచిపోయితిని, సమరప్రయాణంబు
నకు శుభలగ్న మేర్పఱచుటకు గురుండగు వసిష్ఠుని రావింపవల
సియున్నది.

సీత—ప్రాణేశ్వరా! సమరమన్న జ్ఞాపకమునకువచ్చినది. నామనంబున
నొకకోరిక చిరకాలంబునుండియు నాటుయున్నది. అయ్యదితీ
ర్చుటకుమీరే సమర్థులుగాని యెరులుగారు. అదియుంగాక సతు
లు తమకోరికలను పతులయొద్దంగదా చెప్పఁకొనవలయును కా
వున నాయభీష్టంబుదీర్పఁ బ్రార్థింపుచున్నాను.

శ్రీరా—

తే॥ గీ॥ తరుణి, చిత్తమునందు సం ♦ తసముసంద
నామెకోర్కెలు సమకూర్చు ♦ నట్టివాఁడె
ధవుడు; సఖియరోనీదు చి ♦ త్తంబునందు
సంశయింపక నీయభీ ♦ ష్టంబు దెలుపు

సీత—ప్రాణేశ్వరా! మీరుమున్ను రావణునితోడ బోరాడినప్పుడు,
మీలాఘవంబును, బాణసంధాన చాతుర్యంబును, రథగతిక్ర
మంబును, సారథిచమత్కృతియు, ననేకులుజెప్పగా వినియుంటినే
గాని కన్నులారజూచి యుండలేదు.

తే॥ గీ॥ నాటినుండియు నెప్డు ర ♦ ణంబుగలుగు
నంచు, వేచియున్నందులే ♦ యాజికలిగె
గానభవదీయశౌర్యంబు ♦ గనులతోడ
జూచిసంతసించెదఁబది ♦ శుద్ధచరిత

కావున నాయందుదయఁబూని నన్నుఁగూడ మీతోఁగొనిపొందు. కొం
తలను సంగ్రామ రంగంబులకుఁ గొనిపోరాదని సంశయింపవల

దు శోభనగృహంబులకును, శ్రుతులు వినుచోటులకును, యధ్వ
రంబులు జరుగుస్థలంబులకును, యుద్ధభూములకును, గాంతలను
గొనిపోవచ్చునని పెద్దలుచెప్పుదురు.

శ్రీరా—రమణీ! ఇదియా నీవడుగఁదలంచినకోరిక. ఎట్టికోరిక గోరితివి
కలహంబుజూచుటకు నీకేలకోరిక జనించినది! ఇట్లుగోరుమని
నీకేబుద్ధిపుట్టినదో లేక యెవ్వరైన బోధించిరో తెలియకున్నది.
అబలవగు నీవేడ. భయదసంగ్రామ మీక్షించుటేడ? ఇఁకనా
కోరిక విడుము.

తే॥ గీ॥ ఆశతాస్యునివధియించి ♦ యాజియందు
నచటనుండెడు రత్నచ ♦ యంబునీకు
దెచ్చియిచ్చెదఁదపక ♦ మచ్చకంటి
వలదునీవేగు దేరంగ ♦ వలదువలదు

సీత—ప్రాణేశ్వరా! నాకు సంగ్రామముజూడ మిగులకోరికయైనది. ఇ
య్యదిమీరు చెల్లించి తీఱవలయును. అదియుంగాక మిమ్మొక్క-
తృటకాలంబైనను బాసినేనుండఁజాలను.

తే॥ గీ॥ భయదసంగ్రామరంగంబు ♦ బడతియెట్లు
గాంచగల్గునటంచును నెంచబోకు
మాత్మనాయక నీదండ ♦ నలరియుండ
భయముగల్గునె నాకును ♦ భావమందు

శ్రీరా—అబలా! నీకిప్పుడిట్టికోరిక జనించినదిగాని సమరరంగంబున
నొక్కింత కాలమయినను నిల్వజాలవు. రణక్షోణియనగా మన
సాకేత నగరంబున విహరించు యుద్యానవనమని తలంచినావు
కాబోలు.

సీ॥ చిలుకపల్కులకుల్కు ♦ చెందుచునుందువు
దనుజార్భటములకుఁ ♦ దాళఁగలవె
ఎదురెవ్వరాడిన ♦ మదిగుందుచుందువు
వీరవాక్యంబుల ♦ వినఁగగలవె
వెన్నెలవేడికే ♦ భీతినొందుచునుందు
వుగ్రబాణార్చుల ♦ కోర్వఁగలవె
దివ్యసౌధంబులం ♦ దెనిలువగా లేవు
స్యందనంబున నెట్టి లలరఁగలవు
తే॥ గీ॥ సమరగతులేడ నీవేడ ♦ చాన! చూచు
టేడ! గొనిపోవుటేడ! నీ ♦ కెవరుదెల్పి
రిట్టిగతిఁగోరుమంచును ♦ నింతి? చాలుఁ
జాలు; చాలింపుమింక నీ ♦ సాహసంబు
చిత్తంబునకు భయముగలిగించు వీరభటహుంకృతులే గాని యెచ్చోట
జూచినను నీకచ్చట వీణారవంబులు వినిపింపవు. రణరంగంబం
తయు మదరక్తజంబాలమయమై యుండును- ఓరమణీశిరోమణీ!
మున్నుఁగూడ నీవిట్లే నేనరణ్యావాసమునకుఁ బోవుసమయంబు
న బలవంతపరచితివి అప్పుడునీకై నేనెన్నియిడుములబడియుం
టినో యెఱింగియుంటివిగదా? ఇప్పుడు-మరల దోడ్కొనిబోయె
దనినే నేమిహానిగల్గునో యని భయంబగుచున్నది. కావున నా
మాటలాలించి యిచ్చటనుండి మువ్వురత్తలకును బరిచర్యల
సేయుచుసుఖంబున నుందువు.

సీత—(తనలో) నాధుండిట్లు చెప్పుచుండఁగా నేనేమని మఱల బ్రార్థిం
పగలను (ప్రకాశముగా) మనోహరా! సమరసందర్శనకు తూ
హలాయత్తచిత్తనై యున్న నన్నుజిన్నబుచ్చు ధర్మముగాదు. నా

యందు గృపవహించి నాప్రయాణంబునకనుమతింపుఁడు. (మో
మువంచి కన్నీరువిడుచుచున్నది )

శ్రీరా—(తనలో) ఈయబల యీరీతినిఁ గోరుచున్నది. ఇందులకు నేనే
మిసేయుదును. వలదనినంతనే మిగులఖిన్నురాలై మోమువవం
చి కన్నీరు నించుచున్నది. పోనిమ్ము వెంటఁగొనిపోయితినేని,
రాక్షసమధ్యంబున నీమె నిలువఁగలదా— ఏమియును దోఁచ
కున్నది.

(వసిష్ఠుఁడు ప్రవేశించును)

శ్రీరా—గురువర్యా! నాప్రణామంబు లందుకొనుడు.

వసి—విజయీభవ! విజయీభవ!

శ్రీరా—మహాత్మా! ఈయాసనంబు నలంకరింపుడు

వసి—(ఆసీనుడై) రఘురామా! బలంబులన్నియును వచ్చినవిగాబోలునే

శ్రీరా—మహాత్మా! సమస్త సైన్యంబులును వచ్చియున్నవి. ఇంకనీవు
మాయందుఁ గృపాంతరంగుండవై సమర ప్రయాణంబునకు శు
భలగ్న మేర్పఱుపవలయును.

వసి—ఎల్లుండి పుష్యమి. ఆదినంబున సమరప్రయాణంబునకు మిగుల
బాగుగనున్నది. (సీతంజూచి) ఇదియేమి సీత మిగుల ఖిన్నురా
లైయుండినట్లు తోఁచుచున్నది. కారణం బెఱుంగవచ్చునా?

శ్రీరా—సూర్యకులగురుండవగు నీయొద్దనెట్టి రహస్యమైన నుండునే?
ఈకాంతామణి తన్నుగూడ సమరంబునకు గొనిపొమ్మని యడు
గుచున్నది. ఇందునకేమి చేయవలయునో తెలియకున్నది. ఇ
వ్విషయంబున నీయభిప్రాయము ననుసరించి ప్రవర్తించెదను.

వసి—రామా! ఇటురమ్ము (ఇంచుక అవతలకు దీసికొనిపోయి) రాఘ
వా! ప్రయాణంబునకు నీవాటంకంబు గలిగింపకుము. శతకంధ

రుండు భారతీనాథునికై తపం బొనర్చివరంబులం గైకొనునప్పు డుస్త్రీచే జావు లేకుండ వరంబుగాంచలేదు. ఆకారణంబున యీ సీతామహాదేవి వలననే వాడునాశన మందఁగలడని నాకు దోచు చున్నది. సీతను సామాన్యయువతిగ దలంపకుము. ఈమెయే యాదిపరంజ్యోతి. సూర్యచంద్రులీమెకు నివ్వాళిపళ్లెంబులు, బ్రహ్మాండమంతయు నీమెకాటపట్టు మూడుమూర్తులకును సీత లియే కారణము.

తే॥ గీ॥ అతివతోఁగూడ నాజికి ♦ నరుగుమయ్య
మగువచేతను దైత్యుండు ♦ మడియునయ్య
సందియం బిసుమంతయు ♦ బొందవలదు!
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర॥

శ్రీరా—గురువర్యా! ఆజ్ఞ ననుసరించెద గాక (సీతను సమీపించి) సతీ మణీ! నిన్నుఁగూడ రణంబునకు గొనిపొమ్మని గురుండగు వసి ష్ఠమహాముసీంద్రుడాజ్ఞ నొసంగినాడు. నీకోరిక సఫలంబయినది విచారింపక సమర ప్రయాణంబునకు సంసిద్ధవై యుండుము.

శీత—మనోహరా! ఇప్పుడుగదా నేను కృతార్థురాలనైతిని. ఇంక నాక నుజ్ఞనిండు ప్రయాణంబున కావలసినవన్నియు సిద్ధము జేసికొని యత్తలయొద్ద సెలవుగైకొందునుగాక.

శ్రీరా—మంచిది నేనుగూడ నొతసారి బలంబులు విడసియున్నస్థలంబు న కరిగి బలంబులన్నియు నొక్కొక్క పౌజుగా విడదీసి యొక్కొ క్క పౌజునకు నొక్కొక్క నాయకుని నేర్పఱచి, ప్రయాణం బునకు సంసిద్ధముగా నుండుమని చెప్పి, యిచ్చటనుంచి కౌస ల్యా సుమిత్రా కైకాంబల దర్శించి, వారియనుజ్ఞంబొంది స త్వరమ్ముగ నరుదెంచెదను. నీవును నంతఃపురమున కరిగిప్రయా

ణమునకుఁ గావలసినవన్నియు సిద్ధము జేసికొనియుండుము.

శీత—చిత్తము-(నిష్క్రమించును)

శ్రీరా—(నిష్క్రమించును)

రంగము:— సాకేతపురంబున బయలు.

ప్రవేశము— జయంధరుడు

జయం—ఆహా!. ఏమి! ఆవైభవము

తే॥ గీ॥ బాలసూర్యుని మాడ్కి ని ♦ భాసిలంగ
లవితరత్నకిరీటంబు ♦ దలను దాల్చి
వజ్రబాణముకన్నను వాడియైన
ఖడ్గమును, దాల్చి సకలలో ♦ కములు బెగ్గి
లంగ; శతకంధరునిఘోర ♦ సంగరమున
జెండి మునుల తాపసుల ర ♦ క్షించుకొఱకు
జనకపుత్రికతో గూడి ♦ సంతసమున
దివ్యరథమెక్కి విక్రమ ♦ తేజులైన
తమ్ములును, నాత్మజాతులు ♦ తరలిరాగ
భానుసుతి వాయునందన ♦ భల్లుకేంద్ర
కుముదనీలాంగదాదులు ♦ గొల్చిరాగ
రాజదేవేంద్రుడైన శ్రీ ♦ రామమూర్తి!
యాప్రతాపలంకాపురి ♦ కరుగుచుండె.

ధరాభారావతరణార్థమై రవివంశంబున జన్మించిన యాశ్రీరామచంద్రునకు జయంబై, భార్యతోడను, తమ్ములతోడను కుమారులతోడను, సకలబలంబులతోడను సత్వరమ్ముగ సుఖముగా నయోధ్య కరుగుదెంచునుగాక. (నిష్క్రమించును)

(ఇది ద్వితీయాంకము.)



శ్రీరస్తు.

శతకంఠ

# రామాయణము

తృతీయాంకము.

[రంగము! ప్రతాపలంకాపురంబున; శతాస్యుని మందిరంబున ప్రవేశము శతాస్యుఁడుని మంత్రులగు శిఖిముఖుడు దీర్ఘజింహ్వుడు కూలహస్తుడు]

శతా—ఓయీ! మంత్రులారా! బ్రహ్మవర ప్రసాదబలుండనై, ముల్లోకంబులను నిరాఘటంబుగ జరించునాకు దేవేంద్రాదులందఱును బాలికాపులై యరివెట్టుచుండిరిగదా.

దీర్ఘ—అట్లు సేయకయున్నచో దేవేంద్రుఁడీ సరికడవులపాలై యుండడా!

శతా—మనము సకలదిక్కులను జయించితిమి. మునుల హింసింపుచుంటిమి వారియాశ్రమంబులఁ బాడుసేయుచుంటిమి యాగపశువులను వధింపుచుంటిమి. హోమగుండంబులను బూడ్చుచుంటిమి కాని, నాపినతల్లి పుత్రుడయిన రావణుని దునుమాడిన యీ రామునిపై మాత్రము ఇంతవఱకును బగదీర్చుకొనకున్నవారము.

శిఖి—దేవరవారు నిశ్చయముగాఁ దలంచినచో నిదియెంత కార్యము. ఒక్కనరునిపై బగదీర్చుకొనుట యన్ననది యొకఘనకార్యముగా జూడవలయునా.

శూల—దైత్యేంద్రా! రామునిపై బగదీర్చుకొనుటకు నీవు కావలయునా? నేనొక్కడనుచాలనా! ఇప్పుడే యానతిమ్ము. బలసమేతంబుగా నానాకేతంబునకరిగి యాతని నంతంబందించి వచ్చెదను. ఇటువంటి స్వల్పకార్యములయందు దేవరవారు జోక్యము గలుగజేసికొన కుందురుగాక.

దీర్ఘ—దానవేంద్రా!

ము. అనుమానింపక నుమ్ముఖంపుమిపుడే ♦ యయోధ్యం జొచ్చియా
వనజాతాప్త కులీను రాముననిలో ♦ భంజించి; మీాతమ్మునిన్।
హనుమన్ జేసినయువ్విభీషణుని మ ♦ ద్దోర్దండ దర్పంబునన్।
జనులెల్లన్ బెగడొంద గూల్చెదవనిన్ ♦ శౌర్యప్రతాపాగ్రణీ!

శత—మహాభుజ బల సమున్నులయిన మీాయట్టి మంత్రులుండగా నాకేమికొదవ. ఒక్క రాముని నేకాను. పదునాల్గు లోకవాసులను హరిహర బ్రహ్మాదులను గూడ నిర్జింపగలను

(చారుండు రొజుకొనుచుం బరుగెత్తుకొని వచ్చును)

చారు—దానవ రాజేంద్రా! జయము. జయము

శత—ఏమిరా! ఎక్కడనుంచి యీాతెరంగున రొజుకొనుచు వచ్చినావు సింతలయినవార్త, లేమయిన దెచ్చినావా!

చారు—అమ్మయ్యాయ్యో! అయ్యో! అన్నివింతలే- ఆసంగ చెప్పడానికే నాకు భయమగుచున్నది- వెనుకనుంచి యెవరును తఱుముకొని వచ్చుట లేదుగదా?

శత—ఏమిరా! అంతభయమందుచు వచ్చుచున్నావు- ఏదయిన భూతము సోకియుండ లేదుగదా!

చారు—దేవుడూ లేదు. దెయ్యము లేదు. శరీరము గంపమొత్తుచున్నది-

శత—ఓరీ! ఇందులకు గారణమేమియో సత్వరమ్ముగం జెప్పుము. నిభ

యాంబునకుఁ గారణం బెఱిగింపుము. ముల్లోక భయంకరుండగు నీశతాస్యుని సేవకుండవగు నిన్నెవ్వఁడును గాసిబెట్టలేఁడుగదా!

చారు—నన్నెవ్వఁడును బాధింపలేఁడుగాని యాసంగతి దలఁచుకొన్నంతనే భయము గలుగుచున్నది.

శిఖ—ఓరీ! అసందర్భపు మాటలతో నేల కాలయాపనము చేసెదవు? అదియేదో చెప్పుము.

చారు—దానవేంద్రా! మీసన్నిధికి వచ్చునప్పటికి కొంచెమాయాసం తగ్గినది. ఇక చెప్పెదను- మీయానతిని గైకొని యందందు వార్తలారయుటకై చరింపుచుండ నేనొకచోట చిత్రంబు గంటిని. అట్టి దీనాజన్మమధ్యంబున నెన్నఁడును జూచియుండలేదు- మున్నులంకా పురాధీశుండగు రావణుని సంగ్రామంబున వధించిన శ్రీరాముండు మీతోఁ బోరుసేయఁ దలఁచి ప్రళయకాలరుద్రుని చందంబున సమస్తవానర బలంబులతోడను, వచ్చి సముద్రతీరంబున విడచియున్నాడు. ఆతఁడీపాటికి సముద్రముదాటియుండునేమో- మున్నుకపుల బలంబును గూర్చి వినియుంటినే గాని యెప్పుడును చూచియుండలేదు అబ్బా! తారకాగుణంబులనైనను లెక్కింపవచ్చును. గాని వానరబలంబును మాత్రము లెక్కించుట సశక్యము. ఆబలంబులఁ గల యొక్కొక్కవీరుండు జగంబుల మ్రింగునట్లుండెను. అందులో హనుమంతుండను నొక వానరుండది యేమిచిత్రమోగాని మేరుపర్వతము చందంబున శరీరంబు పెంచి, యభ్రమండలం బంటువఱకును వాలము సాచి సమస్తబలంబులను సముద్రమును దాటింపుచున్నాడు- చెప్పినచో మీకేమయిన నాగ్రహము గలుగునేమో యని భయమగుచున్నది కాలమృత్యువులీలఁ దనరుచున్న యాహనుమంతునకు సమానులైన వాఁడీజగంబున లేరని తలంచెదను. సక

ల బలంబులకును సుగ్రీవుండు దండనాయకుండై యొప్పుచుండె ను, రామునితో గూడ నాతనితమ్ములును, గుమారులునుగూడ వచ్చుచున్నారు. ఇదియంతయు నట్లుండుఁడు.

తే॥ గీ॥ మున్నురామ రావణులకుఁ ♦ బోరు దేని
మూలమునఁగల్గెనోయట్టి ♦ పూవుఁబోఁడి
జనకతనయయగుశ్రీరామ ♦ మనుజవిభునిఁ
గూడియేతెంచుచున్నది ♦ కోర్కెతోడ

ఆసీతవంటి యందచందంబులు గలకూఁదురదన స్వర్గమర్త్య పాతాళంబు లందునను గూడలేదు,

శతా—(విని) ఏమీ!

శా॥ ఏమేమీభయమింతలేక మదిలో ♦ నీరీతి శ్రీరాముఁడే
నామీఁదన్ బగబూని ఘోరబల స ♦ న్నాహంబునన్ వచ్చునే
యీమర్త్యుం డెటుసాహసించె నిటు జే ♦ యన్ వింతగాదో చెడన్
భీమోదత్సర్యగ్నిపైన శలభం ♦ బేదూరభావించెగా

ఓరీ! చారుఁడా! నీమాట సత్యమేనా?

చారు—దేవా! దేవరవారితో నసత్యముపల్కుటకు నాకేమి యవసరమున్నది. నేనింకనువారి బలాబలంబులనుగూర్చి చెప్పినచో తమ కాగ్రహంబు గలుగునేమోయని మానివేసితిని.

శతా—ఇట్టి చిత్రంబును నేనెప్పుడును గనియుండలేదు. (ప్రకాశముగా మంత్రులనుజూచి)

ఉ॥ వింటిరెమంత్రులార నర ♦ వీరుఁడొకండు బలంబుతోడ వా
ల్గంటినిగూడియిచ్చటకు ♦ గర్వముచేరిపు భీతిలేక నన్
గెంటగవచ్చుచుండెనట ♦ నిక్కముగానిక శౌర్యమేర్పడన్
దుంటరిఁగూర్చివైచి నవ ♦ తోయజనేత్రను సీతఁదెచ్చెదన్

దీర్ఘ—దానవేంద్రా! ఎప్పుడు సంగ్రామంబు గలుగునాయని వేచియు

న్నందులకా భాగ్యమీనాటికి గలిగినది. దేవరవారు యాజ్ఞ
యిచ్చినచో ఫణీంద్రునికోరలనైనను పెఱికి తెచ్చెదము. అట్టిమాకీ
నీచమర్త్యుండగు శ్రీరాముండెంత ఆతని సైన్యంబెంత. రణంబున
సుగ్రీవహనుమదాది మహావీరులను దునిమి; కులనాశన కార
ణుండైన యావిభీషణుని కాలుని పొలికంపి, యాసీతాసతిని
దెచ్చి మీకు గానుకగా నివేదించెదము. నమ్ముము.

శత—సెబాష్ మంత్రిసత్తమా? నీవుతలంచుకొన్నచో నంతకార్యంబు
ను జేసితీరుదువు. (ఇంచుక యూరకుండి) వాడెంత నరుండై
నను మనము ప్రమత్తులమై యుండరాదు సమస్తబలంబులను
రణంబున కాయత్తపఱచి యుంచుము! అగడ్తలందు జలంబు
పూరింపుము ప్రాకారంబులయందు దానవవీరులను చతురంగ
బలసమేతంబుగా గాపుంచుము. ముగసాలలందు శూలకంఠా
దిదానవ వీరులనుంచి యతిజాగరూకులై యుండవలసినదని మ
దాజ్ఞగా దెలుపుము.

దీర్ఘ—దేవరవారియాజ్ఞననుసరించెదను మనబలంబులెప్పుడు తలంచిన
పప్పుడే రణంబునకు సిద్ధంబై యుండును.

(తెరలో ఏదియోధ్వనివినవచ్చును)

శత—ఏదియో భేరీమ్రోత వినవచ్చుచున్నది

చారు—ఒకవేళ రాముండు సముద్రంబు దాటి యివలకువచ్చి విడిసి
యుండెనేమో.

దీర్ఘ—అయిన నగుంగాక. దానింగూర్చి యింతగా దర్కించవలసిన
యవసరమేమియున్నది. కానిమ్ము, ఆవానర బలంబులను, విభీ
షణుని బలంబులను, మత్కోపాగ్నికింధనములుగా జేసెదను.

(హనుమంతుండు ప్రవేశించు)

హను—(తనలో) ఆహా! లోకరక్షణపరాయణుండైన శ్రీరామమూ

ర్తికి నాయందున్న వాత్సల్యము వర్ణనాతీతము. నేటిదినంబున
సమ్మహాత్ముడు నన్ను బిలచి హనుమా! నిన్నొక వానరశేను
కొని మేమందరమును నీవార్ధుల దాటితిమి. ఇంక నీవు శతకం
ఠునియొద్దకు రాయబారిగానరిగి మనరాకను దెలుపుమని చెప్పి
నాడు. (ఇంచుక యూరకుండి) ఆహా! ఏమి! ఈప్రతాపలంకా
పురవైభవంబు. మున్ను లంకాపురంబును, రావణుని వైభవంబు
ను, నాతనివిలాసంబును, యున్నతపదంబును భోగభాగ్యంబులు
ను నరసితినిగాని యింకులో సహస్రాంశమైనను లేవు. శతకంఠు
ని నిశ్చయముగా దేవేంద్రునికంటె నెక్కువవాడని చెప్పవచ్చు
ను. (ఆలోచించి) భాగ్యముండిన నేమిప్రయోజనము? దానికి
దగినట్లు వినయాదిగుణంబు లుండవలయునుగదా! ఎచ్చట ఘ
నతయుండునో యచ్చట వినయమే భూషణమై యుండవలయు
ను అది లేకున్నచో హానివచ్చును. ఈశతకంఠునకు నిట్టిభాగ్యం
బు లనుభవించుచునుండక నిట్టితుచ్ఛగుణంబు లేలపుట్టెనోగదా
ఇవియన్నియు సీతవినాశకాలంబునకు బుట్టియుండును.(ఇంచు
క యూరకుండి) ఇంక నే నాలస్యమును జేయనేల శతాస్యునియొద్ద
కరిగి మాటలాడెదనుగాక (ఇంచుక నడచి) ఇదుగో రాక్షసులం
దఱును నాభీకరాకారంబును జూచి వెఱగంది పారిపోవుచు
న్నారు నేనిప్పుడే లోనికిం బ్రవేశించి శతాస్యునిప్రక్క నాసీ
నుడనై యుండెదగాక (శతాస్యుని గద్దియ సమీపించి భయం
కరాకారుడై యాసీనుడగును)

దీర్ఘ — (తనలో) ఈతఁ డెవ్వరో కదా. ఇట్టిభయంకరాకారంబును ము
న్నెన్నఁడును జూచియుండ లేదు

శతా — (తనలో) వీఁడెవ్వఁడో నిర్భయంబుగా నాప్రక్కను నాసీనుఁడై
యున్నాఁడు (నిర్లక్ష్యముతోఁ జూచుచు, హనుమంతునితో)

ఉ॥ ఎవ్వఁడవోరి భీతియొక • యించుక లేక పురంబుసొచ్చి బల్
గ్రొవ్వున నాసమక్షమున • గోర్కెలరారగ నంటివిట్లు ని
న్నెవ్వఁడు బంపెనంత యెఱి • గింపుము నిన్ను జూచినంతనే
నవ్వు జనింపుచున్నది మ • నంబున మర్కటాధమా!

హను—ఓరీ!

ఉ॥ రావణుడంచు నొప్పిన సు • రారినివాలము చేతగట్టి లో
కావలి ద్రిప్పి వారధుల • నన్నిట ముంచిన వానివాలినిన్
భూవలయంబునందునొక • యుగ్రశరంబున గూల్చినట్టియా
భూవిభుడైన రామునకు • బోటరిబంటను వాయుజుండరా!

ఆ॥ శ్రీరామచంద్రుండు నీవొనర్చు పాపకార్యంబులను, మునులనేచుటయు మొదలగునవి యన్నియు నాలించి త్వదీయ వధోద్యోగ భారంబు వహించి కతిపయ సేనాసమేతుండై యిక్కడకు వచ్చియున్నాడు సైన్యంబులనన్నిటిని నా వాలంబుమీద సముద్రంబు దాటించితిని. శ్రీరాముని యాజ్ఞ ననుసరించి యిప్పుడు నీకడకు దూతనై యరుదెంచితిని, ఇంక నిన్నాతడు రణంబున గూల్చి తీఱును. కావున నామాటల నాలకించి, యిదివఱకు జేసిన దోషంబుల మన్నింపుమని యా రామచంద్రుని పాదంబులపైబడి శరణు వేడుము, అట్లొనర్చితేని భక్తరక్షణ పరాయణుండగు శ్రీరాముండు నీకే హానియు సేయకుండ సాకేతంబునకు మఱలిపోవును.

శతా—వానరా! నీవు రామునిచేఁ బంపఁబడినవాఁడవా! నేనే రాముని సంహరించుటకు యోధ్యకు వచ్చుచుండుటకై యత్నించుచుండ, వెదుకపోయిన తీవె యేపదంబులకు దగిలినట్లు రాముడే నాముందునకు వచ్చినాడు. ఇంక నామర్త్యుండెందు బోగలుగును?

హను—దానవేంద్రా! నీవీరవాక్యంబుల కిచ్చట నెవ్వరును భయమొందువారు లేరు. ఆశ్రీరాముని పరాక్రమంబు నీవెఱింగియే యుం

టివి ఒక్కఁడే దండకారణ్యంబున ఖరదూషణాది రాక్షసులను బదునాలుగువేల వీరులతో నేలగూల్చినాడు. బ్రహ్మచే వరం బులసంది గర్వించి చరించు నీసహోదరుండయిన రావణుని గూల్చి యాలంకాపురంబునకు విభీషణుని రాజుగాఁజేసినాడు కుంభకర్ణుని నొక్కకోలంగూలనేసె- ఆతఁడు సామాన్యనరుం డని యూహించితివి కాబోలు. అమ్మహాత్ముఁడు నీతోఁ జెప్పమ న్న వాక్యంబులువినుము. దేవేంద్రునికన్న భోగంబులతో దు లదూగు నీవు దుష్కార్యంబులఁజేయుచు ప్రాణంబులపై నేల యాసవీడెదవు. మునుల హింసింపుచుంటివని వారు మొఱపెట్ట తదర్థకార్థమై నిన్నుఁ జంపుటకు వచ్చినాను. ఇంతటినుంచి నీ వట్టి దుష్కార్యముల సేయునని నన్ను శరణుఁబొందితివేని, నిన్ను సైరించెద- లేదేని ప్రచండభండనంబున నిన్నుఁ బుత్రమిత్రా దులతోఁగూడ రావణుంకడకుఁ జేర్చెద. నీవు సమరమునందే కృతనిశ్చయుండవై యుంటివేని యీమూఁడుదినంబులును నను భవించవలసిన భోగంబులన్నియు ననుభవింపుము. ఆశ్రితులకు వలసినభాగ్యము లొసంగుము. షడ్రసోపేతంబుగా భుజింపుము. నీభార్య యసరమతో భోగింపుము. ఆపైన యుద్ధంబున కరు దేరుమని యీరీతిని శ్రీరామచంద్రుంగు నీకెఱింగింపుమనెను.

శతా—ఓరోరి! వానరాధమా! శ్రీరాముఁడెవ్వఁడు? నీవెవ్వఁడవు? భ యంబులేక సభాతలంబునకు వచ్చినదేగాక నోటికివచ్చినట్లెల్ల బ్రేలుచుంటివి.

తే॥ గీ॥ బ్రహ్మనర్చించి వరముల ♦ వడసి లోక
భీకరుండనై దిశలందు ♦ వెలుగుచుండు
నన్ను రాముండుగూల్చునే ♦ నవ్విపోదు
రిట్టిమాటలు విన్న నీ ♦ వింకనేగు.

భయదసంగ్రామతలంబున శ్రీరాముని సమస్తవానరబలంబుల
తో దునిమి కులనాశన కారణుండైన విభీషణుని వధించి నాత
మ్ముడగు దశకంఠునిజంపిన పగదీర్చుకొంటునుగాక. నీవింక ని
క్కడ జేరితివేని నీప్రాణంబులు దక్కవు.

హను—రాక్షసాధమా! నీప్రగల్భంబులకు భీతిల్లువాడనుగాను నేజెప్పు
వాక్యంబులను సావధానంబుగ నాలింపుము.

ఉ॥ నీవునునిన్నుబోలురజ ♦ నీచరులెందఱు నేకమైన ఘో
రావహమందువిక్రమ బ ♦ లాఢ్యుడు, శ్రీహరరూపుడైన ధా
త్రీవిభుడాకియాతని వ ♦ దింపగశక్యమె; యేటికెట్టులీ
వీవృథయైనవాక్యముల ♦ నాడెదుభీతియొకింత జాలకన్

నేవిక్కడ జిక్కితినని నన్నుజంపెదనంటివి. అదియును నీకుశక్యము గాదు
నాపరాక్రమశక్తులు నీవు విని యుండలేదు కాబోలు,

సీ॥ జలధులెల్లనుపాదముల ♦ గల్పిరొంపిగా
వింపగాదగిన ♦ పల్మెంబుగలిగి
కులపర్వతముల బంతుల ♦ వలెనెగజిమ్ము
తాకులాడించెదు ♦ దక్షినుగలిగి
కైతాళమురీతి గగన ♦ భూభాగముల్ పట్టి
వాయించెదు ♦ బలముగలిగి
నడినెత్తిబిడికిట ♦ బొడిచిదిగ్గజముల
సమయింపదగు ♦ మహాశక్తిగలిగి

తే॥ గీ॥ వెలసినాడనుజగతిలో ♦ బోలసుతిండి
పోతులకుజూడగా ధరాను ♦ కేతువన
అట్టినన్నేడనీవేడ ♦ యుద్ధము లేడ
చాలుజాలునుజాలు రా ♦ క్షసకులేంద్ర!

నామాటలువినుము. లేదేని యాపైన నీయిచ్చవచ్చిన యట్లు సేయుము

మ॥ వరగర్వంబునరాములావు నొకయా ♦ వంత్రైనసంత్రైవనీ
వయన్‌జూడప్రసిద్ధ సాధ్యసురయ ♦ క్షానీకముల్ గూడ
వరమందున్ నరవానరుల్ గలనజం ♦ పం దప్పియున్నట్టివీ
వరకున్ దోచెనెనీకుగావరము ప ♦ ద్మప్రోద్భవుండిచ్చుటన్

చం॥ బవరము జేసిరామునర ♦ పాలుడునిన్ను సపుత్రకంబుగా
వివిధబలంబుతోడునిమి ♦ వేడుకమీఱగబోవుగాక దా
నవకులవంశవార్ధిశశి ♦ నావచనంబు నాలకింపుచున్
బ్రివిమలకీర్తిశాలి రఘు ♦ వల్లభుజేరుము బ్రోవుమంచునున్

చ॥ మనమునబాపకృత్యముని ♦ మానకజేసినవాడె తత్ఫలం
బనుభవమందులోకముల ♦ నట్టిది, కాదిదినిన్ను నింకనీ
యనుచరులన్ గుమారకుల ♦ నాప్తులబంధులనందఱిన్ దగన్
రణమునజంపకుండ రఘు ♦ రాముడుబోవడు వేయునేటికిన్

గీ॥ సర్వజనరుచికరమైన స ♦ త్పథార్థ
మధికరోగార్తున కరు ♦ చిమైయునట్లు
నీకు నేనిప్డుజెప్పిన ♦ నీతులెల్ల
నసురనాయక రుచి ♦ యింపవయ్యె మిగుల

కత—ఏమిరా! మర్కటా! కండకావరంబున గండుమీఱి యూరకున్న కొలందిని శ్రీరాముని నామ్రోల శ్లాఘించెదవు అతని గుణంబులెవ్వరెఱుంగరు అతడొనర్చిన కార్యములన్నియు నాభటుండొక్కడు జేయును బాల్యమునందే స్త్రీనిజంపి మహాపాతకంబున కొడిగట్టినాడు. శివుని కోదండంబువఱిచి యమ్మహా దేవునకెగ్గుసలిపినాడు. వృక్షంబుచాటున డాగి, యధర్మముగా వాలింగూల్చినాడు. అట్టి పాపాత్ముడెచ్చటనులేడు. అతడునీకు దొరయగుటకును నీవాతని బంటువగుటకును సరిపోయినది. యూజ

నిచే వరంబులంది లోక భయంకరుండనై చక్రవర్తినై యున్న నాయెదుట నాశ్రీరామునింగూర్చి భాషించెదవు రణరంగంబున నాశ్రీరాముని వధించి తజ్జానకిని దెచ్చుకొందుగాక,

హను—ఓరీ! దురాత్మా! ఏమనిరా పేలితివి? శ్రీరాముడాజ్ఞ నీయక యుండుటచే బ్రదికిపోతివి లేకున్నచో నొక్క ముష్టిఘాతంబుచే నీనూరు శిరంబులుగూడ వ్రక్కలగునట్లు గావించి యుందును గదరా!

శతా—ఓరీనివివ్వఁడు మాకు జిక్కినావు. నిన్నువధించితిమేని నీకు దిక్కెవ్వరు (రాక్షసులంజూచి) ఓరీ! రాక్షసులారా! దూతయగుటం జేసి వీనినిజంపరాదు.మర్దింపుడు

హను—దానవాధమా! నేనొక్కడనే యిచ్చటకువచ్చితినని పట్టదలంచితికాబోలు. (శ్రీరాము నుద్దేశించి) రామం రామం, (శరీరము బెంచి) నాపరాక్రమ మొక్కింతనీకు చవిచూపెదగాక. (శతాస్యుని దన్ని - తనలో) ఇక్కడకునేనువచ్చిన పనిదైనెనది. దైత్యులునన్నుజూచి పరుగెత్తుచున్నారు నేనింక నిక్కడ నుండరాదు. శ్రీరాముని సన్నిధికి సత్వరంబుగా నరిగెదనుగాక.

(నిష్క్రమించును)

(తెరవాలును)

ప్రదేశము—చిత్రగంధమందిరము.

ప్రవేశము—చిత్రగంధి.

చిత్ర—(తనలో) నాకేకారణముచేతనో నాలుగుదినంబులనుండియు దుస్వప్నంబులే వచ్చుచున్నవి. పురంబున నెల్లెడల నృగాలరవంబులు మెండైనవి. గ్రద్దలు పురివిచ్చి యాడుచున్నవి. ఈయప

శకునంబులనుగూర్చి మనంబునఁ బరితాపమందుచుండగా, శ్రీ రాముండు మానగరంబును ముట్టడించుటకు వచ్చియుండెనని పిడుగువంటివార్త వినవచ్చినది. శ్రీరాముండు సామాన్యమాన వుండుగాడు. మున్ను పంక్తికంఠుండు సీతను హరించెనను నెపంబును గల్పించుకొని లంకాపురంబునకు వానరబలసమేతంబుగా నరిగి యారక్కసుని పుత్రామాత్య భృత్యజనవర్గంబుతోగూడ నంతకునియింట కథిథగా జేసెను. ఇప్పుడా మనుజవీరుండు కుమారునియెడల నేమికీడు సేయఁదలంచి యరుదెంచియున్నాడో దోచకున్నది. భారతీరమణ వరసంజనిత దుర్వార గర్వాటోపంబున నాకుమారుండు మునుల నేచుచుండెనని విని యాతనిని శిక్షింప నేతెంచినాడని తలంచెదను. కానిమ్ము. విధి యెట్లుగా జేయునో!

(అప్పుడు శతాస్యుడు ప్రవేశించును)

శతా—అమ్మా! వందనములు-

చిత్ర—కుమారా! ఇటఁగూర్చుండుము.

శతా—(ఆసీనుఁడగును)

చిత్ర—నాయనా! నీవదనంబు చిన్నవోయినట్లున్నది-కారణంబేమి?

శతా—అమ్మా! ఏమియునులేదు. నీవివార్తవింటివా? సాకేతపురాధీశ్వరుండగు రాముండు భార్యాసహితుడై తమ్ములతోడను, వానరబలంబులతోడను నామైకెత్తివచ్చి హనుమంతుఁడను వానరుని నావద్దకు దూతగా పంపినాడు- ఆవానరుండు నాయొద్దకు నిర్భయముగావచ్చి రాముని శ్లాఘింపుచు శరణుబొందమనిచెప్పి మహాభయంకరస్వరూపముదాల్చి పేరోలగంబుననున్న నన్నుఁ దన్ని తన్ను బట్టవచ్చిన రాక్షసవీరుల నుక్కడించిపోయినాడు. ఇంక రామునకును నాకును యుద్ధము తప్పదు.

ఉ. కావున నేను రాముని జ ♦ గత్రితయంబులు భీతినొంద; నీ
భూవలయంబునందుఁ బరి ♦ పూర్ణబలంబున దుర్రించి వైచి నీ
తావనితాలలామను ము ♦ దంబున జెచ్చెరదోడి తెచ్చి యి
చ్ఛావిధి సౌఖ్యమందెద ని ♦ శాచరులెల్లరు నన్ను మెచ్చగన్.

మున్ను రావణుండు లంకాపురంబునకు దోడ్కొని పోయెయుండెనుగాని సఫలీకృత మనోరథుండైయుండలేదు. ఎన్నాళ్ళనుండియో రావణాదులఁజంపిన రామునిపైఁ బగదీర్చుకొన దలంపుచున్నందుల కయ్యది యిప్పటికిసిద్ధించినది శ్రీరాముండు పురంబును ముట్టడించినాఁడు. నేనుసమర ప్రయత్నంబులన్నియు జేసి యాయాస్థలంబులయందు దానవవీరులను గాపుంచి నీచే నాశీర్వాదమంది పోవచ్చినాను.

చిత్రి—హా! కుమారా! దనుజకులం బంతరింపఁజేయ దలంచితివా? సీతనుగొనివచ్చు తలంపునీ కేలయుదయించినది.

మ॥ పగతుండై దశకంధరుండవనిజన్ ♦ బల్మాయఁగొంపోవన
ప్పగిదిన్ గాలము గ్రిమ్మరింపనకటా ♦ వాపిష్ఠియాపైవనున్
బగతున్ జేరెను ధర్మమేజయమనే ♦ పల్కుల్ వృథాపోవునే
పగసాధింపకు రాముతోడనయా ♦ వాక్యంబు బాటింపుమా

ఆ—శ్రీరాముడు వచ్చినాడని నీవు చెప్పనంతనే నాగుండెలు తల్లడమందుచున్నవి. నాలుగురోజులనుండియు మనపురంబున నన్నియు నపశకునంబులే యగుచున్నవి అదియుంగాక యొక్కవానరుండు దూతయైవచ్చి నిన్ను దన్నిపోయెనని చెప్పియుంటివి

మ॥ శరధిన్ గట్టగలాడె మర్త్యుఁడో ♦ కడెంచన్ జేటువాటిల్లె శ్రీ
వరుడారాముఁడుగాక యు ♦ న్నమును నివ్వాడబ్ధి బంధించినాఁ
డు రజోబుద్ధియొకన్నుజేస తినక ♦ ట్టుందాళ్ళితా దెచ్చు కొ
న్నరహిన్ వకానులనేచినావు శ ♦ తకంఠా యీవృథా వైరమున్

సీ॥ ఏనాడునిర్భృతి నినుదుకరంబుల వేడి
మి లంకపై వేడ్కచూపె
ఏనాడుపవనుండు మానినీజన
ముల పయ్యెదకొంగులేర్చ డగదల్చె
ఏనాడు హోహామధగా మూనకవిగావీక
నఖిలదిక్కులు సిండనువరించె
ఏనాడుదిక్పాల కానికరంబు హా
విర్భాగముగొని వెలసినారు
ఖచరగంధర్వ యక్షరాక్షసులు
వెట్టిసేయకీనాడు లంకకుజేరినాడు
నీవువ్యసనాతురుండవై నిక్కమరియు
కునికిచేగాదె యీనాటి కొదలెనిట్లు

శ్రీరాముని బాణాగ్ని యెదుట నెవ్వరును నిలువజాలరు. దైత్యసంహారణం బాచరించి ధరాభారంబు వాపుటకు శ్రీరామమూర్తియై యుదయించెనని మున్నుమాతండ్రి నాతోడఁ జెప్పియున్నాడు. సీత సామాన్యయువతిగా భావింపకు. మూడుమూర్తులకును మూలకారణంబైనయాదిశక్తిగా భావింపుము, అదియుంగాక రాముండు సీతాసమేతుండై రణంబున కరుదెంచుట కేదియో పెద్దకారణంబుండి తీఱవలయును. అదియుంగాక, నీవు బ్రహ్మచేత వరంబులు గైకొనునప్పుడు స్త్రీచే చావులేకుండ వరంబుగైకొని యుండలేదు. కావున నావాక్యంబులాలించి, శ్రీరాముని పాదసన్నిధికరిగి యింతకుమున్ను జేసిన తప్పులను సైరంచి రక్షింపుమని శరణముందుము, శరణాగతత్రాణ బిరుదాంకితుండగు నమ్మహాత్ముండు నిన్నుదప్పక రక్షించితీరును, శరణందిన యావి

భీషణుండెట్లు లంకారాజ్యంబునకు గర్తయై మహావైభవంబుల నందుచున్నాడో గంటివా!

శతా—తల్లీ! నీవు పగవానిని శ్లాఘింపుచుఁ బగవాని స్నీరీతిబల్కుట ధర్మమా! ఆతడు శ్రీమన్నారాయణుండని నీవు చెప్పుచుంటివి ఆతడే నిశ్చయముగాఁ శ్రీహరి యయ్యెనేని రావణుండు సీతం గొనిపోయినప్పుడు తత్క్షణమే వధింపక యొకవానరుని మరుగు జేర నేల?

తే॥ గీ॥ నీచనరునొక్కనిని రమా ♦ నేతయనుచు
పల్కఁగానేలనోయమ్మ ♦ బవరమందు
నతనిఁదమ్ములతోఁగూల్చి ♦ యతివఁదెచ్చి
సౌఖ్యములఁగాంతును యదేచ్ఛ ♦ జననివినుమ

ఇంక నీవు నాకా రాముని విషయమై యేమియుఁజెప్పకుము ఇంక నేను భండనభూమి కరుగవలయు

చిత్రి—కుమారా! నామాటలునీకప్రియంబులైనవి కానిమ్ము. (నిష్క్రమించును)

శతా—రణంబునకరగిన దీర్ఘజింహ్వుని వార్తయేమియు దెలియలేదు. చారులఁ బంపెదనుగాక.

(నిష్క్రమించును)

ఇదితృతీయాంకము.





శ్రీరస్తు.

శతకంఠ

# రామాయణము

చతుర్థాంకము.

[రంగము—సమరభూమి.]

[ప్రవేశము—లక్ష్మణుడు.]

లక్ష్మ—అయ్యో! మున్ను రావణునితో జరిగిన యుద్ధంబునకును నిప్పటి
కిని మిగుల భేదమున్నది. శతకంఠుని సేనానాయకులలో నొక
రికొకరు తీసిపోవువారు లేరుగదా! ఆశిరోముఖుని నేలగూల్చుట
కెంతకష్టపడవలసి వచ్చినది. దానవవీరుల బలపరాక్రమంబులు
కు తెగడొందె వానరబలంబు వెన్నిడి పరుగిడుచున్నవిగదా! ఇం
క శతకంధరుండే రణరంగంబున బ్రవేశించెనేని మాబలంబులు
కెందుభయంబునకు మేరలేకయుండును అదిగో! శూలహస్తుం
డు వానరుల నెట్లు దోలుచున్నాడో! ఇంకనూరకొన్నచో బ్ర
యోజనంబులేదు....(ఎదురు జూచి)

ఉ. వానరవీరులార యిటు ♦ భండనభూమిని వీడిపోవగా
మానిరి ధైర్యమే యదియు ♦ మానవమానముగదా తలంప; భూ
జానియు నేను గల్గ నిటు ♦ స్వాంతమునన్ భయమంద నేల; నీ
దానవులన్ వధింపుడురు ♦ దర్పపరాక్రమ విక్రమంబునన్

మృత్యువునకు భీతిల్లవలదు. జనించిన వారందరికిని మృత్యువెప్పుడో
యొకప్పుడు రానున్నది.

ఉ. నంగరమందు నీర్దళిత ♦ శాత్రవదైత్యుల రక్తమందున।
భృంగన కేళిసల్పు కర ♦ వాలమునాకరమందు నుండ భీ।
తింగని పాటిపోవుదురె ♦ దివ్యబలంబునను జూపకుండ; దీ
నింగనిమెత్తురే జనులు ♦ నిక్కము గా యశమందు శక్యమే।

ఇదిగో! శ్రీరామానుజుండైన లక్ష్మణుండు సంగ్రామభారంబు బూనినా డు. మీరావంతయు స్వాంతంబున బయంబొందక నిలువుడు అది గోయెవ్వడో యొకదైత్యుని దఱుముకొనుచు భరతుండిట్లు పఱు గెత్తుకొని వచ్చుచున్నాడు.

(ముందు దైత్యుండగు దీరజింహ్వుడును, వెనుక భరతుండును ప్రవేశించుచున్నారు)

భర—

శా. ఓరీదానవ యెందుబోదువిటు లో ♦ హోహానిల్వుమీనిల్వు
ఘోరాజిన్ గడుధైర్యమున్ విడిచి నీ ♦ కుంజెల్లునేమీ బాఱగా
నారాచంబు లనేకముల్ బఱపినా ♦ నాదైత్యులంగూల్చి గా
ధీరత్వంబున నిల్చినాడనిదె నీ ధీరత్వమున్ జూపరా।

దీర్ఘ—ఓరీ! మానవా! నీకుభీతిల్లి పఱుగిడు చుంటినని తలంచితివికాబో లు. నీవుకాదు నిన్నుబోలినవీరులు వేయిమంది వచ్చినను నొక్కింత యైనను భీతిల్లువాడనుగాను. నిచమానవుండగు నీవునాకరవాలం బునకెరగా నీయుబడుదువుగదా! యని చింతింపుచున్నాను.

లక్ష్మ—(తనలో) వీరిరువురును సమరోచిత ప్రశంస జేసికొనుచున్నారు నేనిప్పుడు భరతుని పలుకరించగూడదు. ఇచ్చటనే యుండి య వసరమయ్యెనేని, భరతునకు సహాయమొనర్చెదగాక

భర—ఓరీ! దానవాధమా! నీవీరవాక్యంబుల జాలించి రణంబున కవ తరింపుము.

మ. ధరణీగర్భము జొచ్చినంబఱచి పాతాళంబునం డాగినన్
శరధింమున్గియుండంగినన్ వినుమయ ♦ స్వచ్ఛందశౌర్యంబునన్
శరముల్ వారగజేసి నీపయినర ♦ శ్శత్రుక్రిమల్లాడనీ
ధరణింగూల్చెద రామభూధవుండు మో ♦ దంబందచిత్తంబునన్॥

(ఇరువురును యుద్ధము సేయుచున్నారు.)

దీర్ఘ——(తనలో) మానవుని ధైర్యంబధికంబుగ గన్పట్టుచున్నదే

భర——పాఱిపోవుటకు యత్నించుచుంటివా యేమి?

దీర్ఘ——వృథాధీరంబులు పలుకక నీశరంబును గాచికొమ్ము.

(శరప్రయోగము సేయును)

భర—నీశరంబు తుత్తునియలుగా చేయబడినది. ఈశరంబుదప్పక నీప్రాణంబులు దీయునుగాక.

(శరమును వదలును)

దీర్ఘ——(నేలగూలును)

లక్ష——అన్నయ్యా!

భర——తమ్ముడా నీవేల యిచ్చటకువచ్చితివి.

లక్ష్మ——పాఱిపోవు మనబలంబులను మఱలించుకొనుటకు వచ్చితిని, నీవిదీర్ఘజంఘునితో యుద్ధము సేయు తొందరలో నుండుట చేత మాటాడకయుంటిని శత్రుంధరుని సుమిత్రునితో నొకండును మహాభుజబల పరాక్రమముండునునగు నీదీర్ఘజంఘుండు మడియుట మనకొక శుభసూచకము.

భర—దానవుల పరాక్రమ మద్వితీయమైయున్నది ఎంతపోరుసల్పినను వారిబలంబు తెలుగకయున్నది. వానరులు పరాక్రమంబులో కొంత వెనుకబడియున్నవి. ఎట్లయినను మనవీరులను మరికొల్పి రణోత్సాహులుగా జేయవలయును. లేదేని మోసమగువాటిల్లు

ను. అదిగో చూడుము. ఆదానవవానర సంకుల సమరంబున,

చం॥ పొదలిన వేడ్క వీరరసమున్ బలురూపము లొందెనో యనన్
బదువురు సూర్యు రేవురపారి పరాక్రమ శాలి నొక్కనిన్
బదుగుర సూర్యురన్ దగపాయుబలంబున చేర్చియొక్కడున్
బువిలకచాకచిన్ దొడరిపోదిరి నెత్తురు వేర్లు పాఱగన్

ఆసంగర రంగంబు మహాభయంకరంబుగ నున్నవి

సీ॥ కూలుసారధులును (వ్రేలుచక్రంబులు
రాలు కింకిణులును (వీలువేత
న్ంబులు (వేలురధ్యంబుగల్గి
హతాంగగంబులైన శతాంగములును
తునిగిన శిరములు తుమ్ములైనఖు
రములు పగిలిన నోళ్లు బిట్టిగరుజోళ్లు
తెగినవాలమ్ములు నెరిగినకన్నులు
పీడిన భూమ..వితతిగలిగి
రంగదారుర క్తధారాతరంగములగు!
బలుతు రంగము లెల్లడబలు తెరంగు!
లైనగాయంబు లేర్పు కాయములతోడ
నిలకుబీనుగాలై గూలు నేనుగూలును॥

కం. వడిభటశిరము లనెడుతల
గడలానుకనౌను గరచిగరి మీసలచే
యిడి విగతప్రాణులునై
పడియుండిరి కడిదివీరభటు లయ్యాజిన్

లక్ష్మ:—అన్నయ్యా. అన్నగారు ఏరీతినున్నారో మనముచూడవలయును
గావున సత్వరముగ బోవుదమురండు,

(నిష్క్రమింతురు)

రంగము—యుద్ధభూమి శ్రీరాముఁడు సీత విభీషణుఁడు హనుమంతుడు లక్ష్మణుఁడు ప్రవేశించును

శ్రీరా—(లక్ష్మణునిజూచి) తమ్ముడా? ఏమి! ఈరణరంగం బెంత భీభత్సంబుగానున్నది! ఈపాటి మాంసంబు మలద్దవెప్పను లభియించి యుండ లేదని, పిశాచ సంఘంబులును, రక్తప్రవాహంబులందు క్రీడసల్పు భేతాళుని వహంబును, తాండవంబాడు ఢాకినీ గణంబును, శాకినీగణంబుల డీకొని భేతాళగణంబును, పురివిచ్చి యాడు కేకలును, కాకి కేకలు మగమకించు, గద్దలునుగలిగి భయంబు గొల్పుచున్నదిగదా.

లక్ష్మ—అన్నయ్యా! ఎంత భయంకరములగనున్నను, మనచిత్తంబుల యందిప్పటికి గొంచెదైర్యము గలిగినది. శతాస్య మంత్రులందరును మనిసినారు. వారుమడియుటచేత రాక్షసబలంబున సగము నశించినట్లే.

విభీ—దేవా! ఇంక నేటిదినంబున సంగరంబునకుదప్పక శతాస్యుండు రాగలడు కావునమనము జాగరూకులమై యుండవలయును వాడు మహాయుద్ధవిశారదుడు. మాయావిద్యాపరతంత్రుడు.

హను—వాడెంత పరాక్రమ శాలియైన నేమి. అస్మదీయాభీల వాలంబునకుజుట్టి సప్త సముద్రములయందున ముంచి లేవనెత్తెదనుగాక

శ్రీరా—నీవంతటివాడవే యగుదువుగాక,

(తెర బో)

తే॥ గీ॥ ఏడి; శ్రీరామ భూపాలు ♦ డేడి; జనక
జాయుతముగా నెచటనుండె ♦ సంతిసంబు
గలుగుచుండెనతనిజాడ ♦ లవితశరన
యంబుబ్రేరేచుటను జేసి ♦ యాత్మయందా

శ్రీరాము—విభీషణా! ఆపలుకు లెవ్వరివైయుండును.
విభీ—అతడే శతకంఠుడై యుండును. అదిగో,
ఉ॥ సూటిగజూడుమా యదిగో ♦ శూరవరేణ్యమహాత్మ! గాటపుం
గాటుక గొండతండముల ♦ కైవడిగారుమొగిళ్ళ భంగిబల్
దాటుగవచ్చుచుండెనిటు ♦ దానవసైన్యము లుష్ట్రఖడ్గగో
ఘోటకకీటకర్కట కుక్కుట ♦ కీశవృకాదివాహులై
లక్ష్మ—దానవసైన్యం బపారంబైయున్నది.
హను—రామచంద్రా! అనుజ్ఞయిచ్చినచో నానాడు లంకాపురంబు
కగ్నిపెట్టిన చందంబున నీపుష్కరలంక కంటించి వచ్చెదను.
శ్రీరా—విభీషణా! అటుజూడుము. ఏమి ఆభయంకర స్వరూపము!
(సీతంజూచి) తరుణీ! భయమందక నాయందుండుము.
త—దేవా! మీభుజబలపరిరక్షితురాలనై యుండగా నాకేమి భయము.
విభీ—దేవా! అటుజూడుడు.
సీ॥ కాంచనకింకిణీ క్వణనక్షుభితదిశా కుంభి
శ్రీవరంబైయు ఘంటితో శ్రీ
కంఠీరవధ్వజకలితమై వైహాయసంబై
సమస్తాస్త్ర శస్త్ర సహితమై
కామగంబై యనర్ఘ్య సుందరరమణీయమై
త్రిగళమై నిరుపమానమై
లోకితాలోకమై మహాసుకృతమై
మదాసురయుతంబై సమాన
మునమహోన్నతశైలాగ్రమున వెలుగు
దానవదహనుండు బోలె దంష్ట్రికగాళ
వక్రుడై సైన్యయుక్తుడై వచ్చుచున్న
వాఁడె శతకంధరుండు భూపాలచంద్ర!

శ్రీరా—అబ్బా! ఏమిరూపము. ఇట్టి భయంకరరూపంబును మున్నెన్న డును జూచియెఱుంగను. ఈదానవునకే దుష్టగుణంబు లేకున్న చో చతుర్దశ భువనపాలకుండుగా నుండుట కర్హుండై యుండు నుగదా.

లక్ష్మ—నిశ్చయము జెప్పిరి. కాని సంపద్గర్వముచేతను విధాతవర సంజనిత బలంబుచేతను వీడుదర్పించి దేవదూతల నేచుటచేత వీడు మనచే వధ్యుడు.

(తెరలో)

మ॥ మనవంశంబుమున బుట్టి రావణుననిం ♦ భంజించి దర్పించి, స న్మునులన్ బ్రోవగనన్నుస్ దునుమనా ♦ నావావరుల్ వోదు రా ననుజుల్ గొల్వగ భార్యతోనిటకును ♦ ద్యత్ప్రీతి నేతెంచు రా మునిజూడంగ మనంబునందునిపుడా ♦ మోదంబుగల్గెన్ వెసన్

లక్ష్మ—అదిగో! శతాస్యుండిట్లువచ్చుచున్నాడు.

శ్రీరా—విభీషణా! శరంబులిటు తెమ్ము.

విభీ—(శరములందిచ్చును.)

(శతాస్యుండు ప్రవేశము)

శతా—(శ్రీరామునిఁజూచి) ఓహో! నీవేకాబోలు శ్రీరాముండవు. నేడు నాకెంతయు సుదినము.

తే॥ గీ॥ వెదుకబోయినతీవె యే ♦ పదములకును
దగిలినట్టులనాకు నీ ♦ దర్శనంబుగలిగె
నేనెనీకునై యే తేర ♦ నెంచిదనుజ
బలముసంసిద్ధ ♦ పఱచియుండ

మ॥ కలనన్ రావణ కుంభకర్ణులను నీ ♦ కందుంచిబృందారకా వలింగీర్తింప యశంబుగొంటివట స ♦ ద్బాహుప్రతాపంబునన్

తులువా! చిక్కితివెందుఁబోయెదవు మ ♦ ద్దోర్దండదర్పంబునన్
గలనన్ నిన్ వధియించి యీతఱినిలో ♦ కఖ్యాతిజేబట్టెదన్

నాతమ్ములగు రావణ కుంభకర్ణాదులను వధించిన నాటనుండియు, దత్ప్ర గదీర్చుకొన దలంపుఁ బూనియుంటిని, అయ్యది నేటికి సమకూఱినది అదియుంగాక దశాస్యుకో నీవు బవరంబొనర్చు సమయంబు నే నెఱుఁగకుంటినేని రెక్కలుగట్టుకొని లంకాపురంబునకు వ్రాలి సమస్త వానర బలసమేతంబుగా నిన్నంతకుని యింటికతిథిగాఁ జేసియుందును. ఇంతకును నీకు నాచేత నీసమయంబున మరణంబు వ్రాసియుండఁగా నప్పుడేల సంభవించును (విభీషణునిజూచి) ఇదుగో కులనాశన కారణుండైన విభీషణుఁడుగూడ నీవెనువెంట వచ్చియున్నాఁడే ఓరీ విభీషణా! దైత్యకుల ధర్మంబులన్నియు మన్ననగల్పి నీచనరుని శరణుఁ బొందియున్నను జనించిన నీచగతుండవగు నీముఖంబుజూచిన బంచమహాపాతకంబులు సంభవించును నేననేక సారులు నిన్ను వధచుటకై యత్నించితిని గాని నేనువచ్చుచుంట యోంగిమేరుపర్వతప్రాంతంబులకు పాఱిపోవుచు వచ్చితివి ఇంకనిన్నెం డెటుబోయెదవు. నిన్నును రామునగూడ దునుమునప్పు డెవ్వరడ్డమువచ్చెదరో చూచెదగాక ముందుగా నిన్నువధించి పిదప రామునిసంగతిఁ జూచెదగాక

లక్ష్మ—(శతాస్యునిజూచి) ఓరీశతాస్యా! వృథాభీరంబులతో నేమిపని యున్నది

తే॥ గీ॥ సమరమును జేయఁగానెంచి ♦ సంతసమున
వగగుదంచి యున్నాఁడ వీ ♦ వట్టియుడల
మాటలంబల్కఁగా నేల ♦ పోటుగానము
జూపనౌగాక శ్రీరామ ♦ భూపునకును

శతా——ఓ రామా! మీరు నాపోటుతనము బరీక్ష సేయునంతటి మహావీరులా.

తే॥ గీ॥ గిరికళికను వీక్షించి ♦ దివ్యఫలము
టంచుదలపోసి దానిపై ♦ కరిగితుదకు
మరణమున బొందినారలు ♦ రంఛుకరణి
నన్నుజెనకంగవచ్చియు ♦ న్నారమీరు

రందు మదంబడంగించెదగాక (విభీషణునిజూచి) ఓరీవిభీషణా! ముందు నాయస్త్రాగ్నికి నిన్నాహుతి గాం జేసెదంగాక.

(శరప్రయోగము సేయుచున్నాడు)

విభీ——(రాముని వెనుక నుండును.)

శ్రీరా——అస్మదియ భుజబల రక్షితుండైన వానిని నారితేజిచూడ నెవ్వండైనను శక్యమగునా?

చ॥ విలువిలు మింతె సేపురిజ ♦ నీచర వెన్నడినాటిపోకనీ
బలము చలంబుజూపుమని ♦ వారణపరాక్రమ విక్రమంబునన్
గెలనవధించినన్ను బలు ♦ గాకులు గ్రద్దలు పిందగాడ్వగా
లవినోనరింతు నిప్పుడుదలంచి ♦ సురుల్ ముదమంది మెచ్చగన్

శతా——రమ్ము. రమ్ము. ఇదిగో యుద్ధంబునకు సంసిద్ధుడనై యున్నాడను—

[ఇరువురును యుద్ధంబునకు మొనయుచున్నారు]

శతా——రామా! రణంబు విడిచి పాటిపోవకుము.

శ్రీరా——దైత్యాధమా! పాఱుపోతు తెనమనునది మాయింటనుండు శంకమునకైనను లేదు. సర్వాచరనీచర వంశదావానలుండగు శ్రీరాముని యెదుట నాసిబీరంబులు

మ॥ సురశైల్లన్ వినుతించి మెచ్చసుజన ♦ స్తోమంబుహర్షింపగా
సురవైరుల్ సనుగూర్చి చిత్తములలో ♦ శోకింపమానీం దుర్లుఠ

బరితాపంబుతోలంగునంచు మదులన్ ♦ సంతోషమున్ బొందగా
ధరణిన్ గూల్చెదనిన్ రణంబున ♦ సముద్యద్ఘోర శస్త్రాహతిన్
(బాణమును విడుచుచున్నాడు)

(శతాస్యుని శరీరంబునకు బాణముదగులుగానే అనేక
శతకంధరులుపుట్టుదురు)

శతా—మానవాధమా! విరించి వరసంజనిత దుర్వారబలాటోపంబున
దీపించుచున్న నీశస్త్రంబులేవియు బనికిరావు.

(అనేకశతకంధరులు రామునితోయుద్ధమునకు మొనయుదురు)

శ్రీరా—(తనలో)ఆహా! ఏమియీమాయ! ఈతని శరీరంబునండి రక్త
ముగాఅగానే, యనేక శతకంధరు లుదయించినారు.

మ॥ ఇక నెభ్భంగి రణంబునందునన నే ♦ నేవీరునింగూల్చిమా
నికులోత్తంసుల బ్రోవగల్గుదును ♦ నేనేమార్గముంజూతు స
త్ప్రకట ప్రాభవధైర్యసంపదలహా ♦ మన్నయ్యోనింకెట్లు
లీకులగ్రామణులందు బేరుగనుచున్ నే ♦ బ్రఖ్యాతిం బొందెదన్

శతా—రామా! ఏమి యాలోచింపుచుంటివి సంగరభూమివిడిచి పాఱి
పోయినను నేడునిన్నువిడువను

సీత—(తనలో) నాథునకు రణభార మధికమైయున్నది. (తీక్షణముగా
దానవుని జూచుచున్నది.)

శతా—(తనలో) శతకంధరునిజూచిన నామనంబున నావంతయు
భయముగల్గుటలేదు గాని యీసీతనుజూచిన నదేమియో మనం
బున నతిభీతి జనించుచున్నది. దేహము కంపమెత్తుచున్నది. సం
గరస్థలంబున నిల్చుటకు గాళ్లాడకున్నవి ఇంక నేటికి యుద్ధముజా
లించి రేవు మఱలవచ్చెదగాక. ఇప్పటికి నాభుజవీర్యంబును,
శౌర్యంబు వెంపును రామునెఱింగియుండెనుగదా (నిష్క్రా)

శ్రీరా—తమ్ముఁడా! శకాసుఁడేమి కారణముచేతనోగాని రణభూమి విడచి పోయినాఁడు.

విభీ—ఈతఁడు యుద్ధంబునకు వలయుసాధనంబులు కొఱఁతపడి యుండుటచేత నవి తెచ్చుకొనుటకుఁ బోయియుండెను గాఁబోలు.

శ్రీరామ—సంగ్రామరంగంబున మాయా విద్యావిశారదుని వధించి మునులను నేనేరీతి రక్షింప గలుగుదునో యూహింప జాలక యున్నాను.

సీత—మనోహరా! నీచదానవుని నొక్కనిని వధించుట కింతవిచారింప వలయునా! నీవుసకల జగంబుల కధినాథుండవు. అట్టి నీముందు వీఁడెంత- దీనింగూర్చి యింతగా నాలోచింపబనిలేదు- రండు- కర్తవ్యమాలోచింతము-

(అందరు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

శతకంఠ

# రామాయణము

పంచమాంకము.

---

ప్రవేశము—సీత, రాముడు, హనుమంతుడు,

విభీషణుడు, లక్ష్మణుడు.

శ్రీరా—దానవవీరుల భయంకరా ర్భాటంబులువినవచ్చుచున్నవి. ఇం క నాశతాస్యు డరుదెంచును.

సీత—మనోహరా! నాయొక్క చిన్న విన్నపంబొకటి యాలించి, నాము ద్దుజెల్లింపుడు సంగరంబొనర్చి మీరుమిగుల నలసియున్నారు.

తే॥ గీ॥ దానవాధము నేరీతి ♦ ధరణియందు
జించి చెంజాడుడంచును ♦ నెంచవలదు
కరుణ నాయందుఁబూని వే ♦ గంబె నేను
సమరమును సేయ నా ♦ జ్ఞనొసంగుడీశ!

విల్లును, కరవాలంబును, బాణంబునుబూని వీరశ్రమహాయు వఱకును నొ క్కింతసేపు దానవునితో రణంబొనర్చెదను.

శ్రీరా—(తనలో) సమరంబున కరుదెంచునప్పుడు డీమె తన్నుగొనిపో వుమని వేద నప్పుడు వసిష్ఠుండి మొవిషయమై నాకుజెప్పియున్నాడు. కావున నీకును యుద్ధంబున కనుమ తించుటయే శ్రేయస్కర ము (ప్రకాశముగ) తరుణీనీకింత కౌతూహలముగానున్నచో గాసిమ్ము కానియిది మహాప్రళయ ఖండనంబు చైత్యందు

మాయావిద్యా పరతంత్రుడు. కావున జాగరూకురాలవై యుండవలయును (బాణమును లిచ్చుచున్నాడు)

విభీ—(తనలో) రాముని చేత బాణంబులీ సీతామహాదేవి యందుకొని నంత నేయీమె తేజంబంతయు మాటిపోయి కడుదుగ్నిరీక్ష్యమై యున్నది.

శ్రీరా—(తనలో) ఆహా! ఏమి! ఈమె భయంకరస్వరూపము!

సీ॥ పూర్ణచంద్రునిబోలు పొలుపారుసతిమోము
ప్రళయార్కబింబంబు పగిదినుండె
కందర్పకేతులై కనుపట్టుసతిపైట కడు
ధూమకేతులై గానబడియె
అమృతప్రవాహమై యలరారుసతిమోము
అనలసందోహమై యలరుచుండె
సాత్వికరూపియై గన్పట్టునారి
యాదిపరంజ్యోతియై యలరుచుండె

గీ॥ అదిగో యభ్రతలమునవనిల్చి యమరు
లెల్ల శతకంధరునిగూర్చి త్వరితగతిని
లోకముల నుద్ధరింపు మంచును
యాశస్సు లొసంగుచుండిరి సీతకిపుడు

శ్రీరా—(సీతంజూచి) రమణీ శిరోమణీ!

సీ॥ పూవులైనను హస్త ♦ ములందాల్పనోపని
తరుణివి శరమెట్లు ♦ దాల్చినావు
గట్టిగామాటాడ ♦ బిట్టులిక్కపడునీవు
దైత్యుకేకలకెట్లు ♦ తాళినావు

కోపించినంతనే ♦ శాపమందెడినీవు
అస్త్రవేదిమి కెట్టు ♦ లాగినావు
యుద్యానవనమందు ♦ నొక్కింతవిహరింప
నొల్లనసురు సెట్టు ♦ లొంచినావు
తే॥ గీ॥ చూడ(జిత్రమైచూపట్టె ♦ సుదతిమిన్న
భవ్యభవదీయశౌర్యంబు ♦ బాహుబలము
నస్త్రసంధానచాతుర్య ♦ మఖలవీర
వరులుసిగ్గొందునట్టి గా ♦ వరలజేసె

నీవిట్టిదానవనినే నెన్న(డును నెఱుంగనయితిని. నీశౌర్యపరాక్రమ బల
ధైర్యములమందు నేనేమి యక్కఱకువత్తును? నిశ్చయముగా
నాదానవుండునీకు భీతిల్లి నిన్న రంగమువిడిచి రథంబును మరలిం
చుకొని పోయినాఁడు.

సీతా—ప్రాణేశ్వరా? నీవునన్నంతగా శ్లాఘింపవలదు,

మ॥ సనకాదిస్తుతమైన నీదుపదముల్ ♦ సద్భక్తిసేవించుటన్
దనుజుంగూల్చెడి శౌర్యమబ్బె నిపు ♦ డీధాత్రిస్థలిన్; భర్తలన్
ఘనభక్తిన్భజియించు సాధ్వులకు లో ♦ కంబందుసాధ్యంబులే
దనుటె! శ్లాఘ్యముసేయనేలనిటు నీ ♦ యాత్మన్ విలోకింపుమా

నేను మీకరుణా రసంబునకు బాత్రురాలనేగాని శ్లాఘ్యంబునకు బాత్రు
రాలనుగాను.

(తెరలో గలగలము)

హను—అవిగో మరల దైత్యార్భాటంబులు వినవచ్చుచున్నవి.

శ్రీరా—ఒకవేళ శతకంఠుండు వచ్చుచుండెనేమో?

సీత—మనోహరా? వానినిరానిండు

మ॥ రణరంగంబుననేడు నాదుభుజ ద ♦ ర్పంబొప్పగావానినిన్
ఘనబాణంబులపాలుజేసి త్రుటిలో ♦ ఖండించెదన్; దేవతల్

ననువీక్షించి ముదంబునందగ భవ ♦ త్కారుణ్యమున్ బొందెదన్
యన మానంబిసుమంత లేదు వినుడీ ♦ నాపట్టుఁ జెల్లించెదన్

నిన్నటిదినంబుననే ప్రచండ సంగ్రామరంగంబున వాడంతకుని గృహం
బును జేరవలసియేయుండెను. కాని యస్మత్పరాక్రమాటోపం
బునకు భీతిల్లి రథంబు మఱలించుకొని గృహంబునకరిగినాడు నేటి
దినంబున వాడు నాకుభీతిల్లి చతుర్దశభువనంబులయందును నొం
దుడాగినను సరే యస్మన్నిశిత నారాచపరంబరులఁ గప్ప చెండా
డెదఁ గాక?

(తెరలో)

ఉ॥ తేరునఁబోవనిమ్ముగను ♦ తీవ్రమతిన్ రణమందు నేడు భూ
దారుని డస్సితీ సహా ♦ తంబుగ నేలకుఁ గూల్చి సైన్యమున్
భూరి పరాక్రమము ♦ మీఱగ నాశనముం బొనర్చి బృం
దారకులెల్ల భీతిపడ ♦ ఖ్యాతిని గాంతు ధరాతలంబునన్

సీత—అదుగో ఆశతాస్యుడే వచ్చుచున్నాఁడు. [హనుమంతునిఁ జూచి]
హనుమంతా! జాగరూకుండవై యుండుము.

(శతకంఠుడు సారధి సమేతముగా బ్రవేశించును.)

శత—(సీతం జూచి) అబలా సంగ్రామ విద్యావిశారదుండనగు నిన్ను
నలయించితినని సంతసింపుచు నేను నీకు సంగ్రామంబు సేయనెంచితి
వి కాబోలు,

తే॥ గీ॥ యుగ్రసమరమున నలసి ♦ యుంటచేత
నిన్నయనివీడిపోయితి ♦ వన్నెలాడి
కానినిశ్శౌర్యములజూచి ♦ భయమునంది
నాడనంచును నెంచకు ♦ యతివమిన్న

అదియట్లుంచుము నీతోనింకొక్కటి జెప్పవలసియున్నది.

చం॥ పరువుబ్రతిష్ఠలన్నియును ♦ బాసిరణంబున నిన్నుడించి! భీ
కరసమరంబు సేయుగను ♦ జాలఁ భీతిబొంది నీమనో
హరుఁడిటుడాగినాడు మది ♦ యందునసిగ్గు జనించెనిన్ను
బొగిగొన నాడుదానవగు ♦ టిక్ జనకాత్మజ యేమిచెప్పుదున్

నీతో యుద్ధముసేయుటకు నాకుమిగుల సంశయంబగుచున్నది. సుకు
మార శరీరవగునిన్ను నా బాణంబుల పాలుసేయ నాచిత్తంబు
సమ్మతింపకయున్నది.

సీత—

మ॥ దనుజా! రాముడుభీతినొంది యిటులు ♦ న్నాడంచుభావింపగా
జనునేరావణకుంభకర్ణుల మహా ♦ సంగ్రామ రంగంబులో
ననివార్యంబునగూలనేసినభుజా ♦ టోపుండుసికింతయుక్
మనమందున్ బయమందువాడెతగునే ♦ భావింపకేల్లాఁడగన్

ఓరీ! అమ్మహాత్మునిగుణంబులు నీకేమి తెలియును?

మ. అకలంకుండు; మహానుభావుడు త్రిలో♦కాగాద్యు డాద్యుండు సూ
రకుల శ్రేష్ఠుండు దానవాంతకుడు శూ♦రమ్మన్యు డాదానవాం
తకుడుర్ రామునిదివ్యతేజమును♦దైత్యానీకు నేరీతినిక్
బ్రకటంబౌగతి కారులార్వకుము దు♦ష్టా దైత్యానంశాధమా

శత— తెలియకేమి? ఆతనిశౌర్యప్రతాపంబులు సద్గుణంబులును లోక
విదితంబులే.

తే. గీ. స్త్రీయటంచును నెంచక ♦ జిత్తమందు
తాటకినిగూలనేసెను ♦ ధాత్రియందు
పాపమంచును నెంచక ♦ వాలినొక్క
కోలచేతను చాటున ♦ గూలనేసె

ఇట్టివెన్నియో యున్నవి. ఇట్టి పాపచరిత్రుండు నిష్కళంకచరిత పొగడ్తము
[illegible]

తే. ధరనయోనిజవౌచును ♦ దనరునీకు
నీచచరితుండు నానొప్ప ♦ రాముడెట్లు
భర్తయయ్యెనొనోదోపదు ♦ భానురాంగి
వింతగొల్పుచునుండెను ♦ స్వాంతమందు

శ్రీరా—(సీతంజూచి)తరుణీ! మర్యాద నతిక్రమించిమాటాడు వీనితో
నేటిమాటలు?

హను—ఓరీ! దానవా! సాక్షాద్విష్ణుస్వరూపుండగు రామునియానిందిం
పుచుంటివి.

సీత—

తే॥ గీ॥ సంధిమొత్తిన ♦ జ్వరపీడితుండనగ
పేలుచున్నాడు దైత్యుండు ♦ వీనివింక
భయద సంగ్రామరంగంబు ♦ నంపుగూల్చి
లోకబాధలమాన్పుడు ♦ బ్రాకటముగ

(దానవునింజూచి) ఓరీదానవా! నీకుజేటుకాల మాసన్నమైనది. అందు
చేతనే యీరీతిం బేలుచున్నావు ఇంక మాటలతో బ్రయోజ
నము లేదు.

మ॥ రణమందింకనునిల్వుమీయిక భుజా ♦ దర్పంబుమించ దను
ర్గుణటంకారమొనర్చి నీయిసువులన్ ♦ దప్పించినీబాధులన్
జనహింసాపరులన్వధించి యమరౌ ♦ ఘంబుల్ల ఘింగా
ఘనకీర్తింగొన దానవాధ దుగడున్ ♦ మోదింపదైత్యాధమా

ఓరీ నీమాటలకుకట్టిపెట్టి సంగ్రామరంగంబున కవలెదింపుము.

శత—సంగ్రామరంగమా ఏమిధైర్యము చతుర్దశభువనంబులయందు
ను నీతీరున మాటలాడు కాంతనెందును జూచియుండలేదు. నీ
పురణోద్యోగంబునందే నిలువదలంచితివేని నీయభీష్టము దీర్చు
కొమ్ము.

(ఇరువురును యుద్ధంబునకు మొనయుచున్నారు.)

శతా—(తనలో) ఇట్టిశౌర్యంబు నేనెందును జూచియుండలేదు. బలం బంతయు తగ్గిపోవుచున్నది.

తే. అజునిచేతగన్న వరము ♦ లన్నిమున్ను
గలసె; నేడారణంబునఁ ♦ గలికిచేత
నీల్గుదంచును దోచెడి ♦ నిక్కువముగ
దోచదయ్యెను నేను ♦ స్వాంతమందు

ఆ! ధాతా! నీభక్తునకుఁ తుదకు స్త్రీచే జావు వ్రాసిపెట్టితివా! అక్కటా! సమస్త బ్రహ్మాండంబులును, సూర్యచంద్రాదులును నీమె ముఖంబున గన్పట్టుచున్నారు.

సీత—ఓరీ! శతకంధరా! యీ యాగ్నేయాస్త్రము నిన్నుదహించి తీఱును. (అస్త్రప్రయోగము సేయును)

(శతాస్యుఁడు గూలును)

శ్రీరా—రమణీ! నీపరాక్రమము నివార్యమైనది మగనిపేరునిలబెట్టితివి

సీత—మహాత్మా! ఇయ్యది త్వదీయ కరుణచేలనే జరిగినది.

విభీ—దేవా! తండ్రిమృతవిని నీలకంఠుడు శోకించుచు నిట్లువచ్చుచున్నాడు. ఆతనిని మన మాదార్చి తదీయభక్తునిగా నేలుట సమంజసము.

శ్రీరా—ఆతడనుగ్రహింపఁ బడదగినవాడు రండు.

(నిష్క్రమింతురు.)

—♦నీలకేతుని పట్టాభిషేకము.♦—

(నీలకేతుని సింహాసనముపై గూర్చుండబెట్టి)

శ్రీరా—వత్సా! నీలకేతా!

తే. గీ. మునులనేచిన కారణం ♦ బునను నీదు.
తండ్రినాచేత గూలెను ♦ ధరణియందు
దానికింతయునీదు ♦ చిత్తంబునందు
జింతజేర్పక రాజ్యంబు ♦ నేలుమయ్య.

సంపూర్ణము